# ఆంధ్రప్రదేశ్

సెప్టెంబర్, 1958.

సంపుటి 2 భాద్రపదము, శాలివాహనశకము - 1880 సంచిక 11

## విషయసూచిక



— చందా వివరాలు —

సంవత్సరానికి 2 రూపాయల 16 నయాపైసలు

విడిప్రతి వెల 18 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి

సిటిజన్ ప్రెస్‌లో ముద్రింపబడినది.

# ముఖచిత్రం

## హార్సిలేహిల్ దృశ్యం
(లోపల వ్యాసాన్ని చూడండి)

-:-0:0-:-

## ప్రభుత్వ ప్రచురణలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ఆంధ్రప్రదేశ్‌లో ఆహారోత్పత్తి | * తె. లేక ఉ. * | ... | 12 | న.పై. |
| 2. | ఆంధ్రప్రదేశ్ పశు సంక్షేమం | * ఇ. లేక తె. లేక ఉ. | ... | 12 | ,, |
| 3. | ఆంధ్రప్రదేశ్ చేతి పనులు | ఇ. లేక తె. లేక ఉ. | ... | 12 | ,, |
| 4. | ఆంధ్రప్రదేశ్‌లో నీటి పారుదల, విద్యుచ్ఛక్తి | ఉ. | ... | 12 | ,, |
| 5. | ఆంధ్రప్రదేశ్‌లో గిరిజన సంక్షేమం | తె. లేక ఉ. | ... | 12 | ,, |
| 6. | ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలు | ఉ. | ... | 12 | ,, |
| 7. | "ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక, | ఇ. తె. లేక ఉ. | ... | 18 | ,, |
| 8. | హైదరాబాదు నగరం, శివార్లు-గైడ్-ఇంగ్లీషు | | ... | 50 | ,, |
| 9. | హైదరాబాదు నగరం పటం | | ... | 12 | ,, |
| 10. | ఆంధ్రప్రదేశ్ ఖనిజసంపద - ఇంగ్లీషు | | ... | 25 | ,, |

***గమనిక :*** ఈ పుస్తకాలు ఖరీదు డబ్బు చేరగానే పంపబడతాయి.

* ఇ = ఇంగ్లీషు

* తె = తెలుగు

* ఉ = ఉర్దూ

ప్రతులకై
సమాచార, పౌరసంబంధాల శాఖ
డైరెక్టరు,
హైదరాబాదు - ఆం. ప్ర.
చిరునామాకు వ్రాయండి.

# ఓ మహాత్మా

(శ్రీ టి. వి. కృష్ణరావు)

ఓ మహాత్మా!
నీకివె కై మోడ్పులు ॥ఓమ॥

నీవె దేవుడవు నిఖిల జాతికి
శాంత్యహింసలకు సాక్ష్య దేవుడవు ॥ఓమ॥

జాతి భేదముల జక్కడంచితివి
హరిజన సేవకు అంకితమైతివి
గిరిజనోద్ధరణ గురుడవైతివి
అధికారంబుల అవల ద్రోసితివి
నిరంకుశత్వము నీరు చేసితివి
బీద ధనికుడను భేదము మాపితి
రైతు సోదరుల రాణదీర్చితివి
పడమట మబ్బుల పార ద్రోలితివి
తూరుపు చీకటి తోలి వేసితివి
వెలుగు నీడలకు వెలుపల నిలిచితి ॥ఓమ॥

వాడు వీడనే తేడా చూపని
భాగ్య దేవతవు భారతీయులకు
జగమున వెలిగే జగద్బంధుడవు
పాదు కొల్పితివి ప్రపంచ శాంతికి
అమోఘమైన అహింస మంత్రం ॥ఓమ॥

నీ తేజమె మా నీరాజనమౌ
నీ హాసమె మా నేత్రామృతమౌ
అంగరక్షయౌ ఆధారంబౌ
ఆత్మశక్తియౌ ప్రాణప్రదమౌ
జాతిపితా మానేతా
కైకొనుమివె మా జోహారులు ॥ఓమ॥



# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్నమొత్తముల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి!

భారత దేశం యొక్క

సమాజాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు, రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి!

*మీ డబ్బును యీ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| **12** సంవత్సరముల నేషనల్ ప్లాన్ సేవింగ్సు సర్టిఫికెట్లు | పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5,000 లవి వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు. |
| **10** సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు | ఏటా నూటికి 4 వంతులు వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 50 లవి మొదలు రూ. 25,000 లవి వరకూ కొనవచ్చు. |
| పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకుఅకౌంట్లు | రూ. 25 ల నుంచి రూ. 10,000 ల వరకూ గల నిల్వలపై నూటికి 2½ వంతులచొప్పునా, రూ. 10,000 లను మించిన నిల్వలపై నూటికి 2 వంతుల చొప్పునా వడ్డీ ఇవ్వబడుతుంది. |

15 సంవత్సరముల అన్యూయిటీ సర్టిఫికెట్లు (రెండవ సీరీస్)

| | |
|---|---|
| జారీచేయబడు ధరలు : రూ. 3,325, రూ. 6,650, రూ. 13,300 రూ. 26,600. | ఈ సొమ్ము, నూటికి సంవత్సరానికి కొంచెమెక్కువగా 4 వంతుల చొప్పున యిచ్చే చక్రవడ్డీతో సహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 26,600 ల వరకు కొనవచ్చు. |

## ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!

## భావి భారత సౌభాగ్యానికై పెట్టుబడి పెట్టండి!

ఇతర వివరములకు, యీ పెట్టుబళ్ళకి సంబంధించిన నిబంధనావళికొరకు :

నేషనల్ సేవింగ్సు కమిషనర్, నాగపూర్ చిరునామాకికాని లేక

రీజియనల్ నేషనల్ సేవింగ్సు ఆఫీసర్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు (దక్కన్)

చిరునామాకి కాని వ్రాయాలి.

ఆంధ్రప్రదేశ్‌లో:

# విలక్షణమైన కొన్ని శిల్పకళాఖండాలు

డా. ఎమ్. రామారావు

వేర్వేరు కాలాలకు, రకాలకు చెందిన దేవాలయాలు ఆంధ్రదేశంలో అసంఖ్యాకంగా వున్నాయి. వాటిలో పెక్కింటిని యింకా పరిశీలించి వాటి శిల్ప, కళాసంపదను గురించి ప్రజలకు తెలియచేయవలసి వున్నది. ఈ దేవాలయాలను పరిశీలించేటప్పుడు అద్వితీయమైన చెక్కడాలను, విగ్రహాలను పెక్కింటిని నేను చూడడం తటస్థించింది. ప్రధానమైన కొన్ని విగ్రహాలను గురించి దిగువవర్ణిస్తున్నాను. అవి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోగల భీమవరం, పాలకొల్లు, పానగల్, నందికందిలలో వున్నాయి.

## నరసింహస్వామి

పురాణగాథ : విష్ణుమూర్తి యీ నాలుగవ అవతారం యొక్క ప్రాముఖ్యము, ప్రయోజనము కూర్మ, వాయు, పద్మ, విష్ణు పురాణాలలోను, తదితరమైన పురాణాలలోను వర్ణించబడ్డాయి. బ్రహ్మదేవుడు ప్రజాపతులని వ్యవహరింపబడే పెక్కురు పుత్రులను బడసి, ప్రాణికోటిని సృష్టించమని వారిని నియోగించాడు. వీరిలో కశ్యప ప్రజాపతికి హిరణ్యాక్ష, హిరణ్య కశిపులనే కుమారులిద్దరు కలిగారు. ఈ సోదరులిద్దరూ మహాయోధులై రాక్షస జాతికి నాయకులైనారు. వారిద్దరూ కూడా తపస్సుచేసి బ్రహ్మవల్ల అరుదైన వరములను పొందారు. ఆ తరువాత వారు దురహంకారులై దేవతలను పీడించ నారంభించారు. ఈ బాధలు పడలేక దేవతలు విష్ణుమూర్తికి మొరపెట్టు కున్నారు. విష్ణుమూర్తి స్వయంగా ఈ రాక్షస సోదరులతో యుద్ధం చేసి హిరణ్యాక్షుడిని వధించాడు. దానితో హిరణ్యకశిపుడు విష్ణు ద్వేషియై ఆయనపై పగ తీర్చుకోడానికి ప్రతిజ్ఞ చేశాడు. ప్రజలు విష్ణు నామాన్ని వుచ్చరించడానికి కూడా వీలు లేదని శాసించాడు. కాని హిరణ్య కశిపుని కొడుకు ప్రహ్లాదుడు మహా విష్ణుభక్తుడై ఆయన గొప్పతనాన్ని లోకానికి చాటేవాడు. కొడుకు విష్ణుభక్తిని మళ్లించడానికి రాక్షసరాజు ఎన్నో ప్రయత్నాలు చేసి విఫలుడయాడు. కొడుకు ప్రవర్తనతో నిస్పృహచెందిన హిరణ్యకశిపుడు తిరస్కారంగా ఒక స్తంభాన్ని తన్ని దానిలో విష్ణుమూర్తిని చూపించమని కొడుకుని అడిగాడు. తక్షణం స్తంభం విరిగి అందులో నుంచి నరసింహ రూపంలో విష్ణుమూర్తి ప్రత్యక్షమయాడు. నరసింహస్వామి హిరణ్యకశిపుని పైకి వురికి, సమీపంలో నున్న ద్వారం వద్దకు లాగుకొని వెళ్ళి, సంధ్యాసమయంలో అతడిని చీల్చి చెండాడేడు. నరునిచేతకాని మృగంచేతకాని తాను వధింపబడకూడదని హిరణ్య కశిపుడు బ్రహ్మవల్ల వరము పొందుటచే విష్ణుమూర్తి నర-సింహ రూపం దాల్చవలసి వచ్చింది.

నరసింహస్వామి విగ్రహాలు హిరణ్యకశిపునితో యుద్ధంచేస్తున్నట్టూ, అతని పొట్టను చీల్చేస్తున్నట్టూ, ప్రహ్లాదుని అనుగ్రహిస్తున్నట్టూ లక్ష్మీ సహితుడై వున్నట్టూ, యోగిగావున్నట్టూ వివిధ రీతుల్లలో వుంటాయి.

## 1. యోగనరసింహస్వామి (ఫొటో.1. చిత్రం 1)

ఉనికిపట్టు:— తూర్పుగోదావరిజిల్లా కాకినాడ తాలూకాలోని చాళుక్య - భీమవరం గ్రామములోని మాండవ్య-నారాయణ దేవాలయం ఆవరణ ఉత్తరం వైపునగల గోడ గూటిలో యోగనరసింహస్వామి విగ్రహం మలచబడింది.



యోగనరసింహస్వామి, భీమవరం

వర్ణన :— ఈ దేవునిముఖం అసలైన సింహం ముఖం. నేత్రాలు భయంకరంగా వున్నాయి. పై పెదవిమీద సింహం మీసాలు, తలకిరింద సింహం జూలు వున్నాయి. ఆయన బాసినమఠం వేసుకొని కూర్చునివున్నాడు. యోగ-పట్టా ఆయన మోకాళ్ళని, వీపుని బంధిస్తున్నది. ఆయనకు నాలుగు చేతులు వున్నాయి, పై కుడిచేతిలో చక్రము, పై యెడమచేతిలో శంఖము వున్నాయి. క్రింది రెండు చేతులను ముందుకుచాచి మోకాళ్ళపై వేసుకున్నాడు. మెడలో మోకాళ్ళవరకూ వ్రేలాడే హారం వుంది.

వివరణ :— ఇది గిరిజారకానికిచెందిన కేవల-నరసింహుని విగ్రహం. దీని రూపం శిల్పశాస్త్రంలో (గోపీనాథరావు - హిందూ విగ్రహవర్ణన సంపుటి 1 భాగం 1, 149—150 పుటలు) చెప్పబడిన వర్ణనకు సరిపోతున్నది. విగ్రహం చక్కగా చెక్కబడింది. దానినిచూస్తే భక్తి వెల్లుబుకుతుంది. ప్రస్తుతం మాండవ్య-నారాయణ దేవాలయంగలచోట ఒకప్పుడు రాజనారాయణ దేవాలయంవుండేది. ఈ రాజనారాయణ దేవాలయాన్ని తూర్పు చాళుక్యరాజు దానార్ణవ-రాజనారాయణ నిర్మించాడు. అతడు క్రీస్తుశకం పదవ శతాబ్ది పూర్వార్ధం తొలిపాదంలో రాజ్యపరిపాలన చేశాడు. ఈ విగ్రహం రాజనారాయణ దేవాలయంలోని చిన్నచిన్న గుడులలో ఒక దానిలో వుంచబడి వుంటుంది. తూర్పు చాళుక్య శిల్పకళకి యిదొక చక్కని నిదర్శనం.

## 2 స్థాన-నరసింహస్వామి (ఫొటో. 1. చిత్రం 2)

ఉనికిపట్టు : ఈ శిల్పం మెదక్ జిల్లా నందికండి గ్రామంలోని రామలింగేశ్వరాలయం హాలులో మధ్యగల నాలుగు స్తంభాలలోను ఒకదానిపై వున్నది.

వర్ణన : ఈ దేవుని కుడికాలు నిటారుగా వుంది. ఎడమకాలు మోకాటివద్ద వంగి వున్నది. దాని వ్రేళ్లు నేలమీద మోపబడి వున్నాయి. ఆయనకు యెనిమిది చేతు లున్నాయి. పై రెండుచేతులలోను ఒకచేతిలో గద, మరొకచేతిలో చక్రము వున్నాయి. పైనగల మూడవచేతితో హిరణ్యకశిపుని యెడమ కాలును పట్టుకున్నాడు. పైనగల మిగిలిన మూడు



నరసింహస్వామి, నందికండి

చేతులలోను ఒకచేతిలో శంఖము, మరొకచేతిలో హిరణ్యకశిపుని ప్రేగులు వున్నాయి. మూడవచేతితో హిరణ్యకశిపుని కుడిచేతిని పట్టుకున్నాడు. దిగువ

రెండు చేతులతోను రాక్షసుని పొట్టను చీలుస్తున్నాడు. ఆయన ముఖం నిజమైన సింహం ముఖం. నేత్రాలు భయంకరంగా వున్నాయి. పై పెదవిపై సింహం మీసాలు, మెడమీద సింహం జూలు వున్నాయి. కాళ్లకు అందెలు వున్నాయి. మొలకు మొలనూలువుంది. దానికిమధ్యను గుండ్రనిదట్టీవుంది. దానికి ముత్యాల జాలరు వుంది. ఆయన యెడమ వైపున సింహము, కుడివైపున గరుడుడు వున్నారు. గరుడుడు అంజలి ఘటిస్తూ వున్నాడు. స్వామి తన కుడికాలును హిరణ్యకశిపుని రెండుకాళ్లమధ్యనువేసి అతడిని పట్టుకున్నాడు. హిరణ్యకశిపుని కుడికాలు స్వామి కుడితొడకు ఆనివుంది. రాక్షసుని కుడిచేతిలో ఖడ్గము, యెడమచేతిలో డాలు వున్నాయి.

వివరణ : శిల్పశాస్త్రం ప్రకారం నరసింహస్వామి యీరూపంలో ఆయన శంఖ,చక్ర,గదలను, పద్మాన్ని (హిందూ వి. వ. 1-1, 153వ పుట) ధరించాలి. కాని యీ శిల్పంలో పద్మంలేదు. రాక్షసుని చంపుటకు, అతని ప్రేగులు పట్టుకొనుటకు రెండుచేతులు కాక నాలుగుచేతులు వ్రపయోగించబడుతున్నవి. ప్రకటింపబడిన వుదాహరణలలో దదిక్కోంబుకిచెందిన విగ్రహం ఒకటున్నది. దానిలో స్వామి ప్రలంబ పాదాసనంలో కూర్చుని రాక్షసుణ్ణి తన తొడలపై వేసి చీలుస్తూవుంటాడు. **(Ibid 1-1. Pl. XLVI)** అయితే మనకు సర్వసాధారణంగా గోచరించే రూపంలో స్వామి ప్రలంబ పాదాసనంలో కూర్చుని రాక్షసుని తన ఒడిలో వుంచుకొని, ఒకచేతితో అతని మకుటమును, మరొక చేతితో పాదాలను పట్టుకుంటాడు. నరసింహస్వామి నిల్చుని హిరణ్యకశిపుని చంపుతూన్నట్టున్న విగ్రహాలు చాల తక్కువ, అందులోనూ స్వామి తన రెండుకాళ్లమధ్యనూ రాక్షసుడిని పట్టుకున్నట్టున్నవి నాకు తెలిసినంతవరకూ యెక్కడా లేవు. అందుచేత యీ శిల్పం దానికదే సాటి.

### 3. ప్రహ్లాదానుగ్రహమూర్తి (ఫ్లైట్. 1. చిత్రం 8)

**ఉనికిపట్టు :** ఈ శిల్పంకూడా నందికంది రామలింగేశ్వరాలయంలోని మధ్య నాలుగు స్థంభాలలోను ఒకదానిపై వున్నది.

వర్ణన : స్వామి కుడికాలు నిటారుగా నేలమీద మోపివుంది. ఎడమకాలు ప్రహ్లాదుని నడుంచుట్టూ చుట్టివుంది. ఆయనకు నాలుగుచేతులు వున్నాయి. పై కుడిచేతిలో చక్రము, పై యెడమచేతిలో శంఖము వున్నాయి. జాపివున్న ప్రహ్లాదుని యెడమచేతిని స్వామి తన క్రింది కుడిచేతితో పట్టుకొని, క్రింది యెడమచేతిని బాలుని శిరస్సుపై వుంచాడు. ఆయన అందెలు, మంజీరములు, ముత్యాలజాలరు మొలనూలు ధరించాడు. ముఖం నిజమైన సింహం ముఖం. తల క్రింద సింహం జూలు వుంది. స్వామి తన తలను కుడివైపుకు వంచి ప్రహ్లాదుని చూస్తూ వుంటాడు. ప్రహ్లాదుడు స్వామి యెడమకాలి బంధంలో ఆయన కటి యెడమవైపున ఆనుకుని నిల్చుని ఆయన ముఖంలోనికి చూస్తూ వుంటాడు.



నరసింహస్వామి, నందికంది

వివరణ : నరసింహస్వామి యీ మూర్తి వర్ణన శిల్పశాస్త్రంలోకాని ప్రకటింపబడిన ఉదాహరణలలోకాని నాకు యెక్కడా కనబడలేదు. స్వామి శాంతమూర్తియై కూర్చునివున్నట్టు, అంజలి ఘటించి ప్రహ్లాదుడు ఆయన యెదుట నిలచి వున్నట్టు చూపించిన సందర్భాలున్నాయి. ప్రస్తుతపు శిల్పంలో ప్రహ్లాదుడిపై అనుగ్రహం చూపడం సహజంగా చిత్రించబడింది. ఇది శిల్పి రమ్యమైన భావుకతకు నిదర్శనం.

నందికండి రామలింగేశ్వరాలయం. తరువాతి పశ్చిమ చాళుక్య పద్ధతిలో నిర్మితమైన దేవాలయాలకు చక్కని వుదాహరణ. ఇది 10 లేక 11 వ శతాబ్దానికి చెందివున్నట్టు కనబడుతుంది. పైన వర్ణించిన 1, 2 శిల్పాలుకూడా యీ కాలానికి చెందినవే.

## లింగోద్భవమూర్తి

పురాణగాథ : శివుని యీ రూపం ప్రాముఖ్యాన్ని గురించి లింగ, కూర్మ, వాయు, శివపురాణాలలో వర్ణించబడింది. విశ్వనిర్మాత యెవరు అనే అంశంపై ఒకప్పుడు బ్రహ్మ, విష్ణుల మధ్య వివాదం యేర్పడిందిట. వారి వివాదం కొనసాగుతుండగా అసంఖ్యాకమైన అగ్నికీలలతో ప్రజ్వరిల్లే మహాలింగం ఒకటి వారి ముందు వుద్భవించింది. ఆ లింగోద్భవ స్థానాన్ని కనుగొనాలనే కుతూహలంతో బ్రహ్మ విష్ణులు తాత్కాలికంగా తమ వివాదానికి స్వస్తి చెప్పారు. బ్రహ్మ హంసరూపం దాల్చి లింగం కొన కనుగొనుటకు పైకి యెగురుతూ వెళ్లాడు. విష్ణుమూర్తి అడవిపందిరూపం దాల్చి లింగం ఆది కనుగొనుటకు భూమిని త్రవ్వుకుంటూ వెళ్లాడు. కాని వారికి లింగం తుద, మొదలూ యెక్కడా కనబడలేదు. వారు చివరికి తిరిగి లింగంవద్దకు వచ్చి దానిని స్తుతించారు. అప్పుడు శివుడు లింగంలోనుంచి ప్రత్యక్షమై బ్రహ్మ, విష్ణు లిద్దరూ తన నుంచియే వుద్భవించారనీ, తాము ముగ్గురూ కూడా ఒకే శక్తి భిన్నరూపాలని వారికి తెలియపరచాడు. దక్షిణభారత శిల్పంలో శివుడు లింగోద్భవమూర్తిగా యెక్కువగా కనబడతాడు.

### 1. పూర్ణ మూర్తి (ఫొటో. 1. చిత్రం 4)

ఉనికిపట్టు : ఈ శిల్పం నల్గొండజిల్లా పానగల్ గ్రామంలోని పచ్చల-సోమేశ్వరాలయం దక్షిణపు కుడ్యం నిలువు చప్పకాలలో ఒకదానిపై వున్నది.

వర్ణన : చంద్రశేఖరుని విగ్రహం లింగం ముఖభాగంపై మలచబడింది. ఆయన సమభంగంలో నిల్చునివున్నాడు. ఆయనకు నాలుగు చేతులు వున్నాయి. పై కుడిచేతిలో త్రిశూలము, పై యెడమ చేతిలో నాగము వున్నాయి. క్రింది కుడిచేయి అభయ ముద్రలోను, క్రింది యెడమచేయి వరద



లింగోద్భవమూర్తి, పానగల్

ముద్రలోను వున్నాయి. అందెలు, పొడుగుపాటి ముత్యాలజాలరుగల మొలనూలుధరించాడు. మెడలో యజ్ఞోపవీతంవుంది. ఉదరబంధం, రెండు కంఠహారాలు వున్నాయి. కంఠహారాలలో ఒకటి పొట్టిగాను, మరొకటి పొడుగ్గాను వున్నాయి. శిరస్సుపై కిరీటమకుటం వుంది. పైన కుడి అగ్రాన హంస, దిగువ కుడిమట్టాన అడవిపంది వున్నాయి. హంసకి దిగువన బ్రహ్మ, పందికి ఆవల విష్ణువు వున్నారు. బ్రహ్మ విష్ణు లిరువురూకూడా వినమ్రులై అంజలి ఘటించి నిలచివున్నారు.

వివరణ : శిల్పశాస్త్ర మర్యాదననుసరించి లింగం పైనా, క్రిందాకూడా 1/5 వ వంతు ఖాళీ గా వుండాలి. చంద్రశేఖరుని కాళ్ళలో మోకాళ్ళ దిగువ భాగంపైకి కనబడకూడదు. పై రెండు చేతులలోను, పరశువు, మృగమువుండాలి. (హిందూ విగ్రహ వర్ణన 1-1, 107-109 పుటలు) పైన చెప్పిన శిల్పంలో లింగంపై స్వామికి పైన, క్రిందాకూడా ఖాళీ విడువబడలేదు. ఆయన కాళ్ళు పూర్తిగా మలచబడినవి. బ్రహ్మ విగ్రహంకాని లేక హంసకాని అలాగే విష్ణువు విగ్రహంకాని పందికాని వుంచాలు. కాని యిక్కడ విగ్రహాలు, చిహ్నాలు కూడా చూపబడ్డాయి. ప్రకటింపబడిన ఒక బొమ్మలో

చంద్రశేఖరునికి యెనిమిది చేతులున్నాయి. అన్ని చేతులలోను ఆయుధాలున్నాయి, (Ibid XIII) మరి రెండింటిలో ఆయనకు నాలుగుచేతులున్నాయి. వానిలో పై చేతులలో పరశువు, మృగమున్నాయి. క్రింది యెడమచేయి కట్యవలంబితగా వుంది. (Ibid P 1 XIV) పైన వర్ణించిన విగ్రహం వీటన్నిటికంటె భిన్నంగావుంది. అందువల్ల లింగోద్భవమూర్తికి యిది అద్వితీయమైన వుదాహరణ.

## 2. చిహ్నమూర్తి (ఫొటో. 11: చిత్రం 1)

ఉనికిపట్టు: ఇదికూడా పైన చెప్పిన పానగల్ ఆలయం, అదే కుడ్యపు చౌకాలలో ఒకదానిపై వున్నది.

వర్ణన: మధ్యలో యోనిలో పొడుగాటి లింగం ఒకటి వుంది. దాని కుడివైపున చతుర్భుజుడైన త్రిశిరబ్రహ్మ వున్నాడు. ఆయన క్రింది చేతులు



లింగోద్భవమూర్తి, పానగల్

రెండిటితో అంజలి ఘటించివున్నాడు. ఎడమవైపున విష్ణువు వున్నాడు. ఆయన క్రింది రెండుచేతులతోను అంజలి ఘటించి వున్నాడు. ఆయన ముందు ఒక అడవిపంది వుంది.

వివరణ: ఈ శిల్పం చాల విషయాలలో విలక్షణంగా వుంది. బ్రహ్మకిపైన హంసలేదు. లింగంపైన చంద్రశేఖరుని చిత్రం లేదు. ఇలా యీ దేవుని చిహ్నప్రాయంగా చిత్రించిన శిల్పంకాని, ఛాయాచిత్రంకాని నాకు యెక్కడా కనపడలేదు.

## నటరాజు

పురాణగాథ: శివుడు సృష్టి స్థితి లయకారకుడనీ గొప్ప నాట్య కళాకోవిదుడనీ చెప్పబడుతుంది. ఆయన 108 భంగిమలలో నర్తిస్తాడని శైవాగమాలు చెబుతాయి. వీటిలో నవవిధభంగిమలను శిల్పశాస్త్రం వివరిస్తుంది. లయబద్ధమైన శక్తిస్వరూపమే శివతాండవానికి వెనుకగల మూలభావం. సర్వాధికశక్తి ప్రాథమిక కార్యకలాపాలు అయిదింటిని అనగా సృష్టి స్థితి లయాలను, భ్రాంతి క్షమలను అది సూచిస్తుంది. శివుని చేతిలోని ఢమరుకం సృష్టిని సూచించగా అయన అభయహస్తం ఆశాభావాన్ని, రక్షణను సూచిస్తుంది. ఒకచేతిలోగల అగ్నిపాత్ర లయాన్ని సూచిస్తుంది. పైకి యెత్తిన పాదం విమోచనను లేక క్షమను సూచిస్తుంది. స్వామి నిలుచున్న అపస్మారపురుషుడు మాయ లేక భ్రాంతిని సూచిస్తాడు. విశేష ప్రాముఖ్యంగల నటరాజమూర్తి దక్షిణభారత శిల్పంలోను, విగ్రహవర్ణనలోను విరివిగా అగుపడుతుంది.

### చతుర్భుజమూర్తి (ఫొటో. 11. చిత్రం 2)

ఉనికిపట్టు: ఈ శిల్పం పానగల్లు పచ్చల - సోమేశ్వరాలయం దక్షిణపు కుడ్యం నిట్టన చౌకాలలో ఒకదానిలో వృత్తంలో వున్నది.

వర్ణన: ఇందులో శివుడు పద్మంలో నిలుచుని వున్నాడు. ఆయన యెడమకాలు మోకాటివద్ద వంగివుంది. పాదం భూమిమీద మోపివుంది. కుడికాలుకూడా మోకాటివద్ద వంగివుంది. కాలి వేళ్ళు మాత్రం నేలకాని వున్నాయి. ఆయనకు నాలుగు చేతులువున్నాయి. పై కుడిచేతిలో ఢమరుకము, పై యెడమచేతిలో ఖట్వాంగము వున్నాయి. క్రింది కుడిచేతిలో ఖడ్గము, క్రింది యెడమచేతిలో నాగము వున్నాయి. తల జడలుకట్టివుంది. నాలుగు జడలు పక్కలకు వ్యాపిస్తున్నాయి. స్వామి కంఠహారాలు ఉదరబంధము, యజ్ఞోపవీతము ధరించాడు. మెడలో

పెద్ద పుఱ్ఱెలదండవుంది. అది మోకాళ్ళవరకూ వ్రేలాడుతున్నది. ముఖం భయంకరంగావుంది.



నటరాజస్వామి, పానగల్

వివరణ : ఈ శిల్పంతో సరిపోలే శివుని నృత్తమూర్తి వర్ణన యేదీ శిల్పశాస్త్రంలో యెక్కడా లేదు. ఇటువంటి మూర్తి ఛాయాచిత్రం ప్రకటింపబడ్డంకూడా నేను చూడలేదు. కాబట్టి యీ శిల్పం దానికదేసాటి.

## 2. అష్టభుజమూర్తి (ఫొలై. 11. చిత్రం 3)

ఉనికిపట్టు :- ఈ శిల్పంకూడా పై గ్రామంలోని అదే ప్రదేశంలో వున్నది.

వర్ణన : ఈ శిల్పం అడుగుభాగంలో అపస్మారపురుషుడు బోర్లా పడుకుని వున్నాడు. అతడిముఖం యెడమవైపుకి తిరిగివుంది. కుడిచేతిలో ఖడ్గము, యెడమచేతిలో డాలు వున్నాయి. అతడి యెడమకాలు మోకాటివద్ద వంగి నిలబడింది. కుడికాలు దానికిక్రిందవుంది. ఈ అపస్మారపురుషునిపై శివుడు నిలుచుని వున్నాడు. ఆయన కాళ్ళు స్వస్తికాపశ్రిత భంగిమలోవున్నాయి. కటి ఉద్వాహితభంగిమలో వుంది. ఆయనకు యెనిమిదిచేతులు వున్నాయి. పై కుడిచేతులలో ఒకచేతిలో త్రిశూలము, మరొకచేతిలో పాశమువున్నాయి. మూడవది పిడికిలిబిగించి క్రిందికి వ్రేలాడుతున్నది. పై యెడమచేతులలో ఒకటి త్రిపాటకలోవుంది. మరొకచేతిలో అగ్నిపాత్ర, మూడవచేతిలో నాగము వున్నాయి. క్రింది కుడిచేయి అభయముద్రలో వుంది. క్రింది యెడమచేయి కుడివైపుకుచాచివుంది. విప్పిన ఆ చేయిఅభయముద్రలోనున్న క్రింది కుడిచేయి క్రిందకివచ్చింది. ఇక్కడ స్వామి త్రిభంగిలో నిలబడివున్నాడు. తల స్వల్పంగా కుడివైపుకు వాలివుంది. శిరస్సుపై మకుటము ధరించివున్నాడు. దానివెనుకనుంచి నాలుగుజడలు పక్కలకి పడుతున్నాయి. ఆభరణాలతో ఆయన పూర్తిగా అలంకరించబడ్డాడు. అందెలు, ముత్యాలజాలరుగల మొలనూలు, రమ్యమై వెడల్పైన కంఠహారము, తొడలవరకూగల పెద్దహారము ధరించాడు.

వివరణ : ఈ శిల్పంలో ప్రముఖ లక్షణాలు చాలా వున్నాయి. నాట్యంలో అయిదవ, యేడవ భంగిమల ప్రదర్శన కవసరమైన విధంగా శివునికి యెనిమిది చేతులున్నాయి. కాని హస్త, పాదాల



నటరాజస్వామి, పానగల్

స్థానం భిన్నంగా వుంది. (హిం.వి.వ. 11-1,254-256 పుటలు) కటిపాదాల స్థానం, కటిసమనాట్యం (Ibid P 260) లో వుండవలసిన స్థానానికి సరిపోతున్నది. కాని హస్తాలస్థానం భిన్నంగా వున్నది. క్రింది రెండు చేతుల స్థానం యించుమించు చతుర నాట్యం

(Ibid P 267-268 and Pl. LXVI) లో వుండే స్థానానికి సరిపోతున్నది. కాని చేతులసంఖ్యలో తేడా వున్నది. కాబట్టి యిది నటరాజు కొత్త స్వరూపం.

### 3. చతుర్భుజమూర్తి (ఫొటో. 11. చిత్రం 4)

ఉనికిపట్టు : ఈ శిల్పం పాలకొల్లులోని క్షీర రామేశ్వరాలయం యెదుటగల మండపం స్తంభా లలో ఒకదానిపై వున్నది.

వర్ణన : ఇక్కడ శివుడు అపస్మార పురుషునిపై నిలుచుని వున్నాడు. అపస్మార పురుషుడు కుడి పక్కకి ఒత్తిగిలి పడుకుని వున్నాడు. కాళ్లు యెడుంగా వున్నాయి. కుడిచేతిలో గదవుంది. ఎడమ చేయి యెడమవైపు దేహంపై జాపివుంది: శివుడు



నటరాజస్వామి, పాలకొల్లు

త్రిభంగిలో నిలబడి వున్నాడు. కుడికాలు వంచి అపస్మార పురుషుని నడుంమీద తొడమీద వేశాడు. ఎడమ కాలును కుడివైపుకు త్రిప్పి కుడిమోకాటితో సమానయెత్తులో నిలిపివుంచాడు. ఆయనకు నాలుగు చేతులు వున్నాయి. పై కుడిచేతిలో ఢమరు, పై యెడమ చేతిలో అగ్నిశిఖ వున్నాయి. క్రింది కుడి చేయి అభయముద్రలో వుంది. క్రింది యెడమచేయి కరిహస్తంలో వురము పైకి జాపివుంది. స్వామి జటా మకుటాన్ని ధరించాడు. జడలు పక్కలకు వచ్చి క్రిందికి వ్రేలాడుతున్నాయి. ఆయన కంకణాలు, అందెలు, కంఠహారము, జంటమొలనూలు ధరించి వున్నాడు.

వివరణ : ఇది భుజంగత్రాసిత రకం నాట్యం. ఈ శిల్పం సరిగ్గా శిల్పశాస్త్ర (హిం. వి. వ. 11-1,257 వ పుట) వర్ణనకు సరిపోతున్నది.

## గజాసురసంహారమూర్తి

పురాణగాథ : శివుని యీ స్వరూపం ప్రాముఖ్యం కూర్మపురాణంలో చెప్పబడింది. ఒకానొకప్పుడు కృత్తివాసేశ్వర అనే పేరుగల శివలింగం కాశీలో ప్రతిష్ఠించబడిందిట. దానిని చాలమంది భక్తులు పూజించేవారు. ఒకసారి శివద్వేషియైన రాక్షసు డొకడు యేనుగురూపం ధరించి లింగాన్ని సమీపించి భక్తులను హడలగొట్టాడు. శివుడు లింగంనుంచి పైకి వచ్చి యేనుగును చంపి దాని చర్మాన్ని వస్త్రంగా ధరించాడు. శివుని యీ స్వరూపం దక్షిణభారత శిల్పాలు చాలవాటిలో కనబడుతుంది.

### 1. చతుర్భుజమూర్తి (ఫొటో. 111. చిత్రం 1)

ఉనికిపట్టు : ఇది పాలకొల్లులోని క్షీరరామేశ్వ రాలయం యెదుటగల మండపం స్తంభాలలో ఒక దానిపై వున్నది.



గజాసుర సంహారమూర్తి, పాలకొల్లు

వర్ణన : ఇక్కడ శివుడు ద్విభంగిలో నిలబడి వున్నాడు. ఆయన యెడమకాలు నిటారుగావుంది.

కుడికాలు స్వల్పంగా వంగివుంది. రెండుకాళ్ళూ కూడా యేనుగతలపై మోపివున్నాయి. ఆయన వెనుక గజచర్మం ప్రభామండలంవలె పరచివుంది. దానికాళ్లు పక్కలకు చొచ్చుకురాగా తోక పైకి స్వామి మకుటానికి పైకి వచ్చింది. ఆయనకు నాలుగుచేతులు వున్నాయి. పై కుడిచేతిలో ఢమరు, పై యెడమచేతిలో మృగము వున్నాయి. క్రింది కుడిచేయి అభయముద్రలోను, క్రింది యెడమచేయి వరదముద్రలోను వున్నాయి. ఆయన మొలనూలు కంఠహారము ధరించాడు.

వివరణ : శిల్పశాస్త్రం (హిం. వి. వ. 11-1,151 పుట) ప్రకారం శివుని యీ స్వరూపం చతుర్భుజ మూర్తి రెండుచేతులలో పాశము, దంతమువుండాలి. మిగిలిన రెండుచేతులలోను గజచర్మం వుండాలి. ఈ శిల్పంలో చేతులు భిన్నంగావున్నాయి. స్వామి యెడమపక్కన దేవి, స్కందుడు వుండాలి. కాని యిక్కడ వారు లేరు. కుడికాలు పైకి యెత్తబడి వుండాలి. కాని యిక్కడ అది ఏనుగతలపైవుంది. కాబట్టి యీ శిల్పం విలక్షణమైనది.

## 2. అష్టభుజమూర్తి (ఫొలై. 111. చిత్రం. 2)

ఉనికిపట్టు : ఈ శిల్పం పానగల్ పచ్చల-సోమేశ్వ రాలయం ముందరగల స్తంభాలలో ఒకదానిపై వున్నది.

వర్ణన : ఇక్కడ శివుడు కుడికాలును మోకాటి వద్ద వంచి ఏనుగు తల కుడిపక్కని మోపివుంచాడు. ఎడమకాలు యెడమతొడకు సమానాంతరంగావంగి పైకి యెత్తివుంది. ఆయన వెనుక గజచర్మం ప్రభా మండలంవలె పరచివుంది. కాళ్ళు పక్కలకి చొచ్చుకు వస్తున్నాయి. తోక పైకివచ్చివుంది. స్వామికి యెని మిది చేతులున్నాయి. కుడిచేతులలో ఢమరుకము, ఖట్వాంగము, త్రిశూలము, ఖడ్గము వున్నాయి. ఎడమచేతులు మూడింటిలో అగ్నిపాత్ర, డాలు, పాశము వున్నాయి. క్రింది యెడమచేయి కరి హస్తంలో వురము పైకిజాచివుంది. స్వామికి జటా మకుటము, పత్రకుండలాలు, కంఠహారాలు, ముత్యాలజాలరుమొలనూలు, మోకాళ్ళవరకూవున్న పెద్దహారము వున్నాయి. ఆయన యెడమపైపున పైనుంచి క్రిందికి యిద్దరు పురుషులు యిద్దరు స్త్రీలు వున్నారు. మొదటి పురుషుడు కాళ్లు జాపుకుని కూర్చుని కైదాపట్టుకుని వున్నాడు. రెండవ పురు షుడు కాళ్ళుజాపుకుని కూర్చుని. రెండుచేతులను వంచి కలిపిపట్టుకునివున్నాడు. స్త్రీలు యిద్దరూ అంజలిఘటించి నిలబడివున్నారు. కుడివైపున పైనుంచి క్రిందికి దిగువచెప్పినవారు వున్నారు : 1 రెండు తలలుగల దేత : ఒకపాదంమీద మరొకపాదం వేసు కుని అంజలి ఘటించివున్నాడు. ఒక పురుషుడు నిల్చుని - మృదంగం వాయిస్తున్నాడు. దిగువన యేనుగతలకు కుడివైపున ఒకస్త్రీ నాట్యభంగిమలో నిల్చునివుంది. కాళ్ళువంగి దూరదూరంగావున్నాయి. చేతులు కరిహస్తంలో పక్కలకు జాపివున్నాయి. ఎడమపక్కన ఒకపురుషుడు కాళ్లు ముడుచుకుని కూర్చుని తాళాలు వాయిస్తున్నాడు.



గజాసుర సంహారమూర్తి, పానగల్

వివరణ : గజచర్మం స్థానం శిల్పశాస్త్రంలో చెప్ప బడినట్టుగావుంది. శివుని యీ రూపం అష్టభుజ మూర్తి మూడుచేతులలో త్రిశూలము, ఢమరుకము, పాశము వుండాలి. నాలుగవచేతిలో గజచర్మం వుండాలి. కాని యిక్కడ త్రిశూలము, ఢమరుకము మాత్రమే కనబడుతున్నాయి. ఎడమచేతులలో ఒకటి విస్మయములోవుండాలి. మరొకటి ఆజంతువుచర్మాన్ని పట్టుకోవాలి. మిగిలిన రెండుచేతులలోను కపాలము, ఘంటము వుండాలి. ఈ శిల్పంలో యెడమచేతులు

పూర్తిగా భిన్నంగా వున్నాయి. కాళ్ళస్థానం పరస్పరం మారింది. కుడిచేతులు రెండిటిలో త్రిశూలము, ఖడ్గము వుండుట, ఎడమచేతులలో ఒకచేతిలో డాలు వుండుట శిల్పరత్న (హిం. వి. వ. 11-1, 151-152 పుటలు)లో చెప్పిన నియమాలకి సరిపోతున్నవి. దేవి, స్కందుడు లేరు. కాబట్టి యిది గజాసుర సంహారమూర్తి విగ్రహాలలో విలక్షణమైనది.

## అర్ధనారీశ్వరుడు

పురాణగాథ : విలక్షణమైన శివుని యీ స్వరూపం ప్రాముఖ్యం శివపురాణంలో చెప్పబడింది. బ్రహ్మ ప్రజాపతులనే పెక్కురు కుమారులను బడసి, ప్రాణికోటిని సృష్టించమని వాళ్ళ నియోగించాడుట. ప్రజాపతులు యీ పనిని చేయలేకపోయారు. బ్రహ్మ విచారగ్రస్తుడయాడు. అప్పుడు శివుడు అర్ధనారీశ్వరుడై బ్రహ్మవద్దకు వచ్చి సృష్టి జరుగుట కవసరమైన స్త్రీని సృష్టించని లోపాన్ని ఆయన దృష్టికి తెచ్చాడు. బ్రహ్మ తన పొరపాటుని గ్రహించి శివునిలో సగభాగం ఆక్రమించివున్న స్త్రీరూపంనుంచి స్త్రీఅంశను గ్రహించి స్త్రీలను సృష్టించాడు.

### 1. చతుర్భుజమూర్తి (ఫొలై. 111. చిత్రం 3)

ఉనికిపట్టు : ఈ శిల్పం పాలకొల్లులోని క్షీరరామేశ్వరాలయం మండపం స్తంభాలలో ఒకదానిపైవుంది.



అర్ధనారీశ్వరుడు, పాలకొల్లు

వర్ణన : ఇక్కడ స్వామి ప్రలంబపాద భంగిమలో పీఠంపై కూర్చుని వున్నాడు. ఆయనకు నాలుగు చేతులు వున్నాయి. పై కుడిచేతిలో పరశువు, పై యెడమచేతిలో నల్లకలువ వున్నాయి. క్రింది కుడిచేయి అభయముద్రలోను, క్రింది యెడమచేయి వరదముద్రలోను వున్నాయి. ఆయన జటామకుటం ధరించాడు. జడలు పక్కలకు కదులుతున్నాయి. ఉరము యెడమభాగాన ఒక వురోజము వుంది.

వివరణ : ఈ స్వామి మూర్తి శిల్పశాస్త్రం (హిం. వి. వ. 11-1, 324-326 పుటలు) లో చెప్పిన వివరాలకు సరిపోతున్నది. కాని యెడమకాలు మాత్రం తేడాగా వుంది. క్రింది యెడమచేతులు రెండిటి స్థానము పరస్పరము మారినది.

### 2. ద్విభుజమూర్తి (ఫొలై. 111. చిత్రం 4)

ఉనికిపట్టు : ఈ శిల్పం పానగల్‌లోని పచ్చల సోమేశ్వరాలయం దక్షిణ, పశ్చిమ కుడ్యాల కోణం వద్ద వున్నది.



అర్ధనారీశ్వరుడు, పానగల్

వర్ణన : ఇక్కడ స్వామి పద్మంపై కూర్చున్నాడు, ఎడమకాలు ముడిచివుంది. కుడికాలు క్రిందకు వ్రేలాడుతున్నది. ఆయనకు రెండుచేతు లున్నాయి. కుడిచేయి అభయ ముద్రలోను, యెడమచేయి వరద ముద్రలోను వున్నాయి. ఉరము యెడమవైపున

ఒక పురోజము వుంది. ఎడమ సగభాగం చక్కగా అలంకరించబడివుంది.

వివరణ : ద్విభుజమూర్తి విషయంలో, శిల్ప శాస్త్రంప్రకారం యీ స్వామి కుడిచేయి వరద ముద్రలో వుండాలి. కాని యిక్కడ అది అభయ ముద్రలోవుంది, (హిం. ఐ. వ. 11-1, 324 పుట).

## ఉమాసహితమూర్తి

పురాణగాధ : ఒకానొక సందర్భంలో శివుడు దిగంబరియై మేరుపర్వత సానువులలో సంచరించాడని ఆగమాలు చెబుతున్నాయి. అక్కడ నివసించే ఋషి పత్నులు ఆయననుచూసి ప్రేమవివశలై తమ పాతి వ్రత్యాన్ని భంగపుచ్చుకున్నారు. అందుకు ఋషులు ఆగ్రహించి మంత్రబలముచే అర్ధచంద్రుడు, వృష భము, పులి, సింహము, మృగము, పరశువులను, అపస్మార పురుషుని సృష్టించి శివునిమీదకు పంపారు. దీనికి వెరువక శివుడు అర్ధచంద్రుని తలపై ధరిం చాడు. పాములను దేహాలంకారాలుగా ధరించాడు. వృషభాన్ని వాహనం చేసుకున్నాడు. మృగ, పర శువులను చేతిలో పట్టుకున్నాడు. అపస్మారపురుషుని కాలితో తొక్కాడు. పులినిచంపి దాని చర్మాన్ని పై వస్త్రంగా వుపయోగించాడు. ఈ చిహ్నముల నన్నిటిని ధరించిన శివుడు చంద్రశేఖరుడు అవుతాడు ఈ రూపంలో మూడురకాలు వున్నాయి. ఒంటరిగా నున్నప్పుడు కేవలమూర్తి, దేవీసహితుడై వున్నప్పుడు ఉమాసహితమూర్తి, ఆమెను ఆలింగనం చేస్తున్న ప్పుడు ఆలింగనమూర్తి.

### 1. చతుర్భుజమూర్తి (ప్లేటు. IV. చిత్రం 1)

ఉనికిపట్టు : ఈ శిల్పం పాలకొల్లులోని క్షీర రామే శ్వరాలయం ముందుగల మండపం స్తంభాలలో ఒక దానిపై వున్నది.

వర్ణన : ఇక్కడ శివుడు పీఠంమీద కూర్చుని వున్నాడు. ఎడమకాలు క్రిందికి వ్రేలాడుతున్నది. ఆయనకు నాలుగుచేతులువున్నాయి. పై కుడిచే తిలో పరశువు, పై యెడమచేతిలో మృగము వున్నాయి. క్రింది కుడిచేయి అభయముద్రలోవుంది. క్రింది యెడమచేయి దేవిని చుట్టివుంది. ఆయన అందె లను, కంఠహారాన్ని, యజ్ఞోపవీతాన్ని ధరించాడు. దేవి రెండుకాళ్ళూ వ్రేలాడవేసుకుని ముడిచివున్న ఆయన యెడమకాలిపై కూర్చునివుంది. ఆమె తన కుడిచేతిని స్వామిచుట్టూ వేసి, యెడమచేతిని తన యెడమతొడపై వేసుకునివుంది.



చంద్రశేఖరస్వామి, పాలకొల్లు

వివరణ : ఇది ఆలింగన రకానికి చెందిన ఉమా సహితమూర్తి. శాస్త్రరీత్యా దేవి తన యెడమ కాలిని వ్రేలాడవేసి కుడికాలిని ముణుచుకోవాలి. (హిం.ఐ.వ. 11-1, 130 పుట) కాని యీ శిల్పంలో కాళ్లస్థానం మారింది. శివుని నాలుగు చేతులలోను వి శాస్త్రసమ్మతంగా వున్నాయి. **(Ibid P 129)**

### 2. ద్విభుజమూర్తి (ప్లేటు. IV. చిత్రం 2)

ఉనికిపట్టు : ఈ శిల్పం పానగల్ పచ్చల-సోమే శ్వరాలయం దక్షిణపు కుడ్యం నిలువు చౌకాలలో ఒకదానిపై వుంది.

వర్ణన : ఇక్కడ శివుడు పద్మపీఠంపై కూర్చుని యెడమకాలును ముణుచుకున్నాడు. కుడికాలు మోకాటివద్ద వంగి క్రిందకువుంది. ఆయనకు రెండు చేతులున్నాయి. కుడిచేయి సింహకర్ణ భంగిమలో వుంది. ఎడమచేయి దేవిచుట్టూ వేసివున్నది. దేవి ముడిచివున్న స్వామి యెడమకాలిపై కూర్చున్నది. ఆమె కుడికాలు ముడిగి స్వామి యెడమతొడపై

వ్రేలాడుతున్నది. ఆమె తన కుడిచేతిని స్వామిచుట్టూ వేసింది. ఎడమచేతితో పద్మాన్ని పట్టుకుంది. ఇరు పక్కల చామర వాహినులు వున్నారు.



చంద్రశేఖరస్వామి, పానగల్

వివరణ : శిల్పశాస్త్రం ప్రకారం దేవీసహితుడైన యీ శివునికి నాలుగు చేతులుండాలి. కాని ఇక్కడ రెండే వున్నాయి. ప్రకటించబడిన సమూనాలలో కూడా ఆయనకు నాలుగుచేతు లున్నాయి. (హిం. వి. వ 11-1, 130 పుట, Pl. XXI, XXIV) ఆ పైన శాస్త్రరీత్యా పద్మం దేవి కుడిచేతిలో వుండాలి. కాని యిక్కడ అది యెడమచేతిలో వుంది.

## వృషభారూఢమూర్తి (ఫొటో. IV. చిత్రం 3)

పురాణగాథ : దేవీసహితుడై వృషభమును అధిరోహించిన శివ-చంద్రశేఖరునికి వృషభారూఢమూర్తి అని పేరు. ఆయన వృషభంముందు నిలిచినప్పుడు వృషభవాహనమూర్తి అని పేరు. దక్షిణభారత శిల్పంలో వృషభారూఢమూర్తి సర్వసామాన్యంగా కనబడతాడు.

ఉనికిపట్టు : ఈ శిల్పం పానగల్‌లోని పచ్చల - సోమేశ్వరాలయం దక్షిణ కుడ్యపు నిలువు చౌకాలలో ఒకదానిపై వున్నది.

వర్ణన : ఇక్కడ శివపార్వతులు వృషభారూఢులై వుంది. ఎడమకాలు క్రిందకి వ్రేలాడుతున్నది. ఆయనకు రెండుచేతులువున్నాయి. కుడిచేయి విస్మయంలో వుంది. ఎడమచేయి దేవిచుట్టూ వేసివున్నది. స్వామికి అందెలు, వుదరబంధం, కంఠహారాలు, కుండలాలు, పెద్దహారము వున్నాయి. దేవి ఆయన వెనుక కూర్చునివుంది. ఆమె యెడమకాలు వ్రేలాడుతూ వుంది. ఎడమచేయి స్వామి పిరుదుపైవుంది. చేతిలో నల్లకలువ వుంది. ఆమె ఒంటినిండా ఆభరణాలు వున్నాయి,



వృషభారూఢమూర్తి, పానగల్

వివరణ : శివుని వృషభారూఢమూర్తి వర్ణన ప్రకారం రెండుచేతులలో ఆయుధాలు, ఒకచేతిలో కత్తి వుండాలి. మరొకచేయి యెద్దుపై వుండాలి. దేవి పుష్పాన్ని తన కుడిచేతిలో పట్టుకోవాలి. (హిం. వి. వ. 11-1. 352-353 పుట) ప్రకటింపబడిన ఛాయాచిత్రాలలో దేవి మునిచివున్న స్వామి యెడమకాలిపై కాని లేక ఆయనకు అవతలగా కాని కూర్చునివుంది. (Ibid Pl. CVIII, CXII) ఈ శిల్పంలో శివునికి రెండుచేతులే వున్నాయి. వాటిలో ఆయుధాలులేవు. దేవి ఆయనవెనుక కూర్చుని వున్నది. ఈ విధంగా యిది ఒక క్రొత్తరకం.

పురాణగాథ : కంకాళమూర్తి, భిక్షాటనమూర్తి అనే శివుని రూపాలు రెండిటికి సన్నిహితమైన సంబంధం వుంది. వాటి ప్రాముఖ్యం పురాణాలలో వర్ణించబడింది. విశ్వసృష్టి స్థితులకు తాను సర్వాధికారి నని ఒక సందర్భంలో బ్రహ్మ ఋషులతో చెప్పాడుట. శివుడు యిందుకు సమ్మతించక సర్వాధికారి తానని చెప్పాడుట. బ్రహ్మ శివుని సర్వాధికారాన్ని, సాక్ష్యాన్ని గుర్తించుటకు నిరాకరించాడు. దానితో శివునికి విసుగు జనించింది. బ్రహ్మ తలల్లో తనను దూషించిన తలను నరికివేయమని తన రూపాలలో ఒకమైన భైరవుని ఆజ్ఞాపించాడు. అయిదవ తల పోవటంతో బ్రహ్మ చతురాననుడు అయాడు. కాని శివునికి బ్రహ్మహత్యాపాపం చుట్టుకుంది. ఈ పాపం స్త్రీ రూపంలో భైరవుని వెన్నంటింది. ఆ పాప పరిహారార్థం భిక్షాటన చేయమనీ, భిక్షాన్ని తన పుఱ్ఱె లోనే గ్రహించి, అందులోనే భుజించమనీ, ఆ తరువాత యింకా కావలసిన సహాయాన్ని విష్ణుమూర్తిని అర్థించమనీ బ్రహ్మ శివునికి సలహా చెప్పాడు. శివుడు విష్ణుమందిరానికి వెళ్లగా అక్కడ ద్వారపాలకుడు విష్వక్సేనుడు ఆయనను లోనికివెళ్ళనివ్వలేదు. శివుడు విష్వక్సేనుడినికూడా సంహరించి మరొక బ్రహ్మహత్య చేశాడు. విష్ణుమూర్తి సూచన ననుసరించి ఆయన విష్వక్సేనుని పొడుగు యెముకపైగల అతని పుఱ్ఱెను పట్టుకుని తిరుగుతూ భిక్షాటన చేశాడు. అలా తిరగ్గా తిరగ్గా కొన్నాళ్లకి కాశీలో ఆ రెండు పుఱ్ఱెలు, యెముక మాయమైపోయాయి. శివుని బ్రహ్మహత్యా పాపం అంతరించింది. శిల్పంలో పొడుగు యెముక, రెండుపుఱ్ఱెలు పట్టుకున్నట్టు చిత్రించబడినప్పుడు శివునికి కంకాళమూర్తి అనీ ఊరికే భిక్షాటన చేస్తున్నట్టు చూపించబడినప్పుడు భిక్షాటనమూర్తి అని పేరు.

ఉనికిపట్టు : ఈ శిల్పంకూడా పానగల్‌లోని పచ్చల-సోమేశ్వరాలయం దక్షిణపు కుడ్యం నిలువు చౌకాలలో ఒకదానిపై వున్నది.



భిక్షాటనమూర్తి, పానగల్

వర్ణన : ఇక్కడ స్వామి పద్మంపై ద్విభంగిలో నిలుచునివున్నాడు. ఎడమకాలు నిటారుగావుంది. కుడికాలు స్వల్పంగా వంగివుంది. ఆయనకు నాలుగు చేతులు వున్నాయి. పై కుడిచేతిలో ఢమరుకము, పై యెడమచేతిలో త్రిశూలము, క్రింది కుడిచేతిలో ఖడ్గము, క్రింది యెడమచేతిలో కపాలమువున్నాయి. ఆయనకు జటామకుటం, ముత్యాల హారాలు, మామూలు హారాలు, ముత్యాలజాలరు మొలనూలు పొడుగాటి పుష్పహారము వున్నాయి. ఆయనకు పురోజములు పూర్తిగా పెరిగివున్నాయి. కాని ముఖంమాత్రం భయంకరమైన పురుషముఖం. ఆయన కుడివైపున అంజలి ఘటించి ఒక పురుషుడు నిలబడి వున్నాడు. ఎడమవైపున మరొక పురుషుడు పుష్పహారాన్ని చేతపట్టి నిలచివున్నాడు. ఎడమ వైపున ఒక కుక్కకూడావుంది. అది తన వెనుక కాళ్ళపై నిలబడి, ముందుకాళ్ళనుజాపి శివునిచేతిలో కపాలాన్ని అందుకొనుటకై ప్రయత్నిస్తున్నది.

వివరణ : భిక్షాటనమూర్తి యీ రూపం మిక్కిలి దర్శనీయమైనది. ఇది శిల్పశాస్త్రం (హిం. వి. వ. 11-1, 806-807 పుట)లో యివ్వబడిన వర్ణనకు సరిపోతున్నది.

—:0:—



హార్స్‌లే హిల్ రోడ్డు ముఖద్వారం

వేసవి కేంద్రంగా

# 'హార్స్లే హిల్' అభివృద్ధి

(మిస్టర్ టి. డబ్ల్యు. లాటూష్)

చిత్తూరుజిల్లాలోని "హార్స్లేకొండ" సముద్ర మట్టానికి 4,000 అడుగుల యెత్తున వున్నది. ఒక ప్పుడు హైదరాబాదు వేసవికేంద్రంగా అభివృద్ధిపరచ బడుటకు యెన్నబడిన ఫరహాబాదు పీఠభూమికంటె యిది వెయ్యి అడుగులకంటె యెక్కువ యెత్తుగా వున్నది. ఫరహాబాదు పీఠభూమి మహబూబునగరం జిల్లాలోవున్నది. ఇంచుమించు శతాబ్దం పూర్వం కలక్టరుగావున్న మిస్టర్ డబ్ల్యు.డి. హార్స్లే చిత్తూరు జిల్లాలోని యీ కొండను ఆరోగ్యకేంద్రంగా మార్చ డానికిగల అవకాశాలను కనుగొన్నారు. ఈ విష యాన్ని ఆయన తొలుదొల్త కనుగొనడంవల్ల యీ కొండకు ఆయనపేరు పెట్టబడింది. రాష్ట్ర సహకార శాఖామంత్రి నవాబ్ మెహిదీనవాజ్ జంగ్ దీనిని "ఆరోగ్యకరమైన శీతోష్ణస్థితి, అద్వితీయమైన ప్రకృతి సౌందర్యముగల ప్రదేశము"గా అభివర్ణించారు. ఆయన దాని ప్రకృతి రామణీయకతకు యెంతో ముగ్ధులై యిటువంటి ప్రదేశాన్ని సమిష్టి మద్రాసు రాష్ట్రం వేసవికేంద్రంగా అభివృద్ధి పరచుటకు యెందుకు ప్రయత్నం చేయలేదా అని ఆశ్చర్యం పొందారు. పాత మద్రాసు రాష్ట్రానికి నీలగిరి, కొడైకెనాలువంటి వేసవికేంద్రాలు వుండడంవల్ల బహుశా యీ విషయం అశ్రద్ధచేయబడినదేమోనని ఆయన భావిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో మొదటితర గతి వేసవికేంద్రంగా అభివృద్ధిచేయబడుటకు తగిన యేకైక ప్రదేశం యీ హార్స్లే కొండయేనని ఆయన నిశ్చితాభిప్రాయం.

హార్స్లేకొండ దక్షిణభారతదేశంలో ప్రసిద్ధి కెక్కిన యాత్రాకేంద్రమయిన తిరుపతికి అట్టే దూరంగాలేదు. దీనిని మిస్టర్ హార్స్లే కొంత



కొండసమీపంలోని ప్రాచీనదేవాలయం

వరకూ అభివృద్ధిపరచాడు. ఆయన యీ పీఠభూమి మీద 100 యెకరాల భూమిని సంపాదించి అక్కడ ఒక బంగళానూ, యితర గృహాలను నిర్మించి, ఒకతోట వేశాడు. ఈ విధంగా ఆయన యితరులకు ప్రశంసనీయమైన మార్గదర్శి అయాడు. మిస్టర్ హార్స్లే యేజంట్లు ఆయన ఆస్తిని భవనాలతోసహా 1884లో ప్రభుత్వానికి అమ్మివేశారు. భవనాలు శిథిలావస్థలో వున్నాయి. ఆ ఆస్తి యిప్పుడు అటవీశాఖ అధ్వర్యంలో వున్నది. నవాబ్ మెహిదీనవాజ్ జంగ్ ఆ పీఠభూమినీ, దాని పరిసరాలను పూర్తిగా పరిశీలించి ప్రభుత్వానికి సవివరమైన నివేదికను సమర్పించారు. హార్స్లే కొండను సత్వరం అభివృద్ధిచేయాలని సిఫార్సుచేస్తూ, ఆ విషయంలో ఆయన విలువైన సూచనలనుకూడా చేశారు. ఆయన నివేదికను ప్రభుత్వం పూర్తిగా ఆమోదించింది. ప్రాథమిక పథకాలు తయారుచేయబడ్డాయి.

ఈ పీఠభూమి పై మట్టంలోగల ప్రదేశం విస్తీర్ణం 812 యెకరాలు. దీనిని ప్రాథమికంగా అభివృద్ధి పరచాలని సంకల్పించబడింది. ఇక్కడ తగినంత పెద్ద వేసవికేంద్రాన్ని యేర్పరుచుటకు అవకాశంవుంది. సముద్రమట్టానికి 4,700 అడుగుల యెత్తున 50 యెకరాల విస్తీర్ణంగల ప్రదేశం ఒకటున్నది. అక్కడ నుంచిచూస్తే దశదిశల చక్కని ప్రకృతి దృశ్యాలు కనబడతాయి. ఈ ప్రదేశాన్ని మంత్రిగారు, వారి వెంటవున్న అధికార, అనధికారులు చూశారు. ఇది గవర్నరు వేసవికేంద్రం లేక స్టేట్ హోటల్ నిర్మాణానికి ఆదర్శప్రాయమైన ప్రదేశంగా వుండగలదని సూచించబడింది. ఇక్కడ ప్రభుత్వం తమ అధికారుల నిమిత్తం విశ్రాంతి కేంద్రాన్ని నిర్మించవచ్చు. హార్స్లే కొండమీద నివసించినప్పుడు దానినే రాష్ట్ర గవర్నరు, ఆయన పరివారముకూడా వుపయోగించవచ్చు.

ఇటీవలి వరకూ యీ కొండపైకి నడిచికానీ, గుఱ్ఱంమీదకాని వెళ్లవలసి వచ్చేది. చిత్తూరుజిల్లా బోర్డు అధ్యక్షుడు శ్రీ చెంగల్రాయ నాయుడు ధర్మమా అని యిప్పుడు కొండ దిగువనుంచి దాని అగ్గాన గల పీఠభూమికి మోటార్లు నడిచే ఘాట్ రోడ్డు నిర్మించబడింది. ఈ రోడ్డును కొంత అభివృద్ధి

పరచి తారువేసి, అవసరమైనచోట్ల చిన్న చిన్న వంతెనలను నిర్మిస్తే దీనిపై మోటారుకార్లు సురక్షితంగా ప్రయాణం చేయగలవు. కొండ క్రిందనుంచి 5 మైళ్ల దూరంలోగల తిమ్మనగుంట దీనికి మిక్కిలి దగ్గరలో వున్న రైలుస్టేషను. దానికి కొండ దగ్గరినుంచి మోటార్లు ప్రయాణించగల రోడ్డు వున్నది.

## విద్యుచ్ఛక్తి, నీరు

హార్స్‌లేకొండను ఆరోగ్యకేంద్రంగా అభివృద్ధి పరచుటకు ముఖ్యంగా విద్యుచ్ఛక్తి, నీరు కావాలి. హార్స్‌లేకొండకు తీసుకువెళ్లుటకు 7 మైళ్ల కేబుల్ మాత్రమే అవసరమవుతుంది. మొదట తలపెట్టిన పథకం ప్రకారం అది 15 మైళ్ల పొడుగున వేయవలసి వుండెను.

ఇక నీరు యెప్పుడూ ముఖ్యసమస్యే. దాని విషయంలో తాత్కాలిక సరఫరాకు యేర్పాటు చేయవచ్చు. మిస్టర్ హార్స్‌లే బంగళా ఆవరణలో ఒకదాని పక్క ఒకటి రెండు చెరువులు, ఒక బావి వున్నాయి. మొదట తాత్కాలికంగా నీటిని వాటినుంచి సరఫరా



పీఠభూమి

విద్యుచ్ఛక్తి సరఫరా విషయంలో, మదనపల్లినుంచి అందించుటకు వుద్దేశించబడిన పథకం యిదివరకే సమర్పించబడింది. అది ప్రభుత్వ పరిశీలనలో వున్నది. ఆ తరువాత మదనపల్లినుంచి అంగ్రల్లు, కుర్బలకోటలకు విద్యుచ్ఛక్తి సరఫరాకై ప్రత్యేక పథకం ఒకటి సమర్పించబడింది. దానిని ప్రభుత్వం మంజూరు చేసింది. ఈ పథకం అమలు జరిగిననాడు, 8 మైళ్ల పొడుగు కెవిలైన్లు కలిసి వస్తాయి. విద్యుచ్ఛక్తిని చేయవచ్చు. ఆ తరువాత నెమ్మదిగా సమీపంలోగల లోయలో బావులను త్రవ్వి శాశ్వతమైన యేర్పాట్లు చేయవచ్చు. చెరువులలో నీరు పోకుండా తగిన మరమ్మతు చేయుటకు చీఫ్ ఇంజనీరుకి అధికారమివ్వబడింది. బంగాళా ఆవరణలోగల పాతబావిలోనీరు యెలా వూరుతుందో తెలుసుకొనుటకై దాని నీటిని తోడివేయుటకు యేర్పాట్లు చేయమనికూడా ఆయనకు చెప్పబడింది.



పీఠభూమి మరొక దృశ్యం

హార్స్‌లేకొండ అటవీప్రాంతం కావడాన అది అటవీశాఖక్రింద నున్నది. కాబట్టి ప్రారంభంలో, ప్రస్తుతపు భవనాల అభివృద్ధి పనులను అటవీశాఖ చేపట్టవలసి వున్నది. ఆరోగ్యసదనం పూర్తి అయి, ఆస్తి, యేర్పడగల నిర్వాహకవర్గానికి బదిలీ చేయబడే వరకూ వాటి నిర్వహణబాధ్యతనుకూడా ఆ శాఖయే వహించాలి. ప్రస్తుతపు భవనాలను ఆధునిక పద్ధతులలో అభివృద్ధిపరచవలసి వుంది. అప్పుడే అవి మానవ నివాసయోగ్యం కాగలవు. ఒక భవనం కేఫిటేరియా నిమిత్తం ధారాళమైన షరతులపై అద్దె కివ్వబడుతుంది. అవసరమైనప్పుడు అప్పటికప్పుడు పితికిన పాల సరఫరాకై ఆ భవనాన్ని అద్దెకు తీసుకున్నవ్యక్తి పాడిపశువులను పోషించవలసి వుంటుంది.

ఈ యేర్పాట్లన్నీ పూర్తి అయిన పిమ్మట, రవాణా కంట్రాక్టు తిమ్మనగుంట రైల్వేస్టేషనునుంచి ఆరోగ్య కేంద్రానికి లాండ్-రోవర్ సర్వీసు నడుపుటకు యిచ్చగించే వ్యక్తికి యివ్వబడుతుంది. రోడ్డు నిర్మాణంలో శ్రద్ధగైకొన్న శ్రీ చెంగల్రాయనాయుడు ప్రముఖ సభ్యుడుగా ఒక అడ్-హాక్ అభివృద్ధి కమిటీని ప్రతిపాదించుటకై జిల్లా కలక్టరు ఆహ్వానించబడ్డారు. ఈ కమిటీలో కలక్టరు, సూపరింటెండింగు ఇంజనీరు, అడవుల కన్సర్వేటరు ఎక్స్-అఫీషియో సభ్యులుగా వుంటారు. ఈ అభివృద్ధి కమిటీ అధికారాలను ప్రభుత్వం పబ్లిక్‌వర్క్సు శాఖలో నిర్ణయిస్తుంది.

## సహకారం పాత్ర

ఈ కేంద్రం అభివృద్ధిలో సహకారశాఖకు ముఖ్యమైనపాత్ర వుంటుంది. నాన్‌గెజెటెడ్ వుద్యోగుల సహకారసంఘానికి నిబంధనావళిని తయారుచేసే సమస్యను పరిష్కరించమని చెప్పబడింది. ఈ సంఘం తన సభ్యులకు హార్స్‌లేకొండపై వసతి సౌకర్యాన్ని సమకూరుస్తుంది. వారిలో ప్రతిఒక్కరూ రూ. 10 విలువగల కనీసవాటాకు, సమానమైన 10 నెల వాయిదాలలో డబ్బు చెల్లించమని అడగబడవచ్చు. ఇందువల్ల నాన్‌గెజెటెడ్ వుద్యోగులు, వారి కుటుంబాలు ఆరోగ్యకేంద్రం లాభాలను పంచుకొనుటకు అవకాశం యేర్పడుతుంది. 50 కుటుంబాలకు గృహా

వసతి సౌకర్యాలను కలిగించుటకై ఆ శాఖ ఒక పథకాన్ని తయారుచేయవలసివున్నది. సహకార బ్యాంకులు, కేంద్ర బ్యాంకులు, ఎపెక్సు సొసైటీలు అన్నికూడా తమతమ సభ్యులు, వుద్యోగుల కుటుంబాలు ముప్పదింటికి గృహావసతి సౌకర్యం కల్పించుటకై యీ పీఠభూమిపై గృహనిర్మాణం చేయుటకు ఆహ్వానించబడగలవు. ఇక్కడ హోటళ్లు తెరుచుటకై ప్రైవేటు సంస్థలను ఆహ్వానించుటే కాక యీ కేంద్రం ఆహార సరఫరాకు ప్రభుత్వం 100 కి 25 వంతులవరకూ ధనసహాయంకూడా సౌకర్యార్థం కోనేటిపక్కనే సత్రం నిర్మించుటకు స్వచ్ఛంద ప్రాతిపదికపై ప్రజలనుంచి విరాళాలను సేకరించాలి. మతప్రసక్తిలేని రాజ్యాంగంగల దేశంలో దైవపూజ జరిగే యే ప్రదేశానికి ప్రభుత్వం నుంచి సొమ్ము చేకూరుతుందని భావించుటకు వీలు లేదు. అయితే ప్రజాప్రయత్నానికతోడు ప్రభుత్వంకూడా కొంతసొమ్ము యిచ్చి హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులుకూడా కలిసి ప్రార్థించుకునే మందిరాన్ని యేర్పాటుచేస్తే వుచితంగా వుంటుంది.



కొండసమీపంలోని స్థలం దృశ్యం

చేయాలని సూచించబడింది. ఇది తాత్కాలికంగా 5 సంవత్సరాలపాటు అమలుజరగాలి. రోజుకి 50 మందికి ఆహార సబ్సిడీలో ప్రభుత్వం వాటా రూ 900 కాగలదనీ, అది మిక్కిలి సరసమైనదని చెప్పబడుతున్నది.

ఇక్కడ దైవపూజకు అవకాశాలు కల్పించే విషయాన్నికూడా మరువకూడదు. కొండ శిఖరంపై గల ప్రస్తుతపు దేవాలయం అభివృద్ధికి, యాత్రికుల

ఈ కేంద్రంలో గృహాలు నిర్మించుకొనదలచినవారు టౌన్‌ప్లానింగు డైరెక్టరు తయారుచేసిన సాధారణ లేయవుట్‌లో యిళ్లస్థలాలను యెన్నుకోవచ్చు. అట్టివారంతా ఒక్కొక్కరు రూ. 1000 బయానాగా డిపాజిట్టు చేయాలి. అయితే ఆ ప్రదేశానికి విద్యుచ్ఛక్తి, నీటిసరఫరాలు ప్రారంభమైన రెండుసంవత్సరాలలోపుగా గృహం నిర్మింపబడకపోతే బయానాసొమ్ము స్వాధీనం చేసివేసుకోబడు

తుంది. అయితే నిర్మాణం ప్రారంభింపబడితే పనిసగం పూర్తి అయాక డిపాజిట్టుసొమ్ము తిరిగి యిచ్చివేయబడుతుంది. ప్రభుత్వాధికారులు, పబ్లిక్ వర్కర్లు యిళ్ళుకట్టుకొనుటకై 50 ఎకరాల స్థలం కేటాయించబడుతుంది. ఈ కేంద్రం అభివృద్ధికి ప్రారంభ దశలో శ్రీద్ధగా కొన్నవారికి ముందు ప్రాధాన్యత యివ్వబడుతుంది. సాధారణ ప్రజలకి ఒక వసతి గృహాన్ని, క్లబ్ హౌస్‌ని నిర్మించాలనికూడా సంకల్పించబడింది.

టౌన్ ప్లానింగు డైరెక్టరు యీ పీఠభూమి ప్రదేశాన్ని పరిశీలించి తొలిదశకు లేయవుట్ పథకాన్ని తయారు చేశారు. దీనిలో ముందు ముందు కూడా యీ కేంద్రం అభివృద్ధి తలపెట్టబడింది. రెండవదశ అభివృద్ధికై లేయవుట్ పథకం యిప్పుడు తయారు చేయబడుతున్నది. ఇందు కుద్దేశించబడిన ప్రదేశం సముద్రమట్టంనుంచి 8,000 అ. ఎత్తున వున్నది. అంటే యిది బెంగుళూరుకంటె ఎత్తయినది అన్నమాట. ఎగువ పీఠభూమి పూర్తిగా వినియోగించబడిన పిమ్మటకాని లేక అక్కడ స్థిరపడేవారు ఎక్కువగా వుంటే అంతకంటె ముందుగాకాని యీ పీఠభూమి అభివృద్ధిపని చేపట్టబడాలి.

ప్రభుత్వం యీ పనిని ఒక సంవత్సరం లోపల అమలుపరచుటకు నిర్ణయిస్తే యిందుకు దగ్గరగా రూ 10 లక్షలు ఖర్చుకాగలవని అంచనా. ఆవిధంగా అమలుపరచుట ఆచరణసాధ్యమేనని భావించబడుతున్నది. లేకపోతే వెంటనే విద్యుచ్ఛక్తి, నీటిసరఫరా రోడ్డుఅభివృద్ధిపనులను చేపట్టుటకు ఆఖరికి రూ 5-1/2 లక్షల గ్రాంటు యిచ్చినా చాలు.



# ఖైదీలు పరివర్తనచెందాలంటే

## వారిని దయాదాక్షిణ్యాలతో చూడాలి.

ఈ రోజులలో జెయిళ్ళపరిపాలన ముఖ్యోద్దేశం సంస్కరణ. అంతేకాని శిక్షవిధించడంకాదు. కారణం ఖైదీని సంఘశత్రువుగాకాక వ్యాధిగ్రస్తునిగా చూడ వలసివుండుటే. ఆంధ్రప్రదేశ్ జెయిళ్ళలో యీ విధానం అవలంబించబడుతున్నది. కాబట్టి ఖైదీలు విడుదల అయేసరికి సత్ప్రవర్తనగామారి కష్టపడి పని చేసుకుని ప్రశాంతంగా జీవించే అవకాశం యేర్ప డింది.

జైళ్ళు, బోర్స్టల్‌స్కూళ్ళ పరిపాలన మున్నగు సర్వవిషయాలు జైళ్ళశాఖ అధ్వర్యంలో నడుస్తాయి. ఆంధ్రప్రదేశ్‌లోగల జైళ్ళు అన్నిటి పరిపాలన, అజ మాయిషీలు జైళ్ళ ఇనస్పెక్టర్ జనరల్ చేతిలో వుంటాయి. నేరస్థుల ప్రొబేషన్‌చట్టంక్రిందిపనికూడా ఆయనచేతిలో వుంటుంది. మద్రాసు అవినీతి నిర్మూ లనచట్టం, పిల్లలచట్టాలక్రింది విజిలెన్సుపనికూడా ఆయనకే అప్పగించబడింది.

రాష్ట్రంలో ప్రస్తుతం 4 సెంట్రల్ జైళ్ళు వున్నాయి. ఒకటి విశాఖపట్నంలోవుంది. ఇది అల వాటుగా నేరాలుచేసేవారికి వుద్దేశించబడింది. ఇందులో 762 మందిఖైదీలకు వసతివుంది. రెండవది రాజమండ్రిలోవుంది. ఇది తప్పిజారి నేరంచేసేవారికి వుద్దేశించబడింది. ఇందులో 1,212 మందికి వసతివుంది. మూడవది హైదరాబాదులోను, నాలుగవది వరంగల్లు లోను వున్నాయి. హైదరాబాదు జైలులో 782 మందికి, వరంగల్లు జైలులో 521 మందికి వసతి వుంది. నెల్లూరులో ఒక స్పెషల్ సబ్-జైలువుంది. దానిలో 145 మందికి వసతివుంది. 163 సబ్-జైళ్లు వున్నాయి. నేరస్థులలో పిచ్చివారు హైదరాబాదు, వాల్తేరులలోని పిచ్చాసుపత్రులకి పంపబడుతున్నారు. రాజమండ్రిలో స్త్రీల నిమిత్తం ఒక స్టేట్ జైలువుంది. అందులో 200 మందికి వసతివుంది.

ఆంధ్రరాష్ట్ర చట్టంక్రింద, యీ ప్రభుత్వానికి మద్రాసుప్రభుత్వం చెంగల్పట్టు సీనియర్ సర్టిఫికెట్టు స్కూలుని, మైసూరుప్రభుత్వం బళ్ళారిలోని ఆలీ పురంజైలుని, బోర్స్టల్‌స్కూలుని, జూనియర్ సర్టిఫైడు స్కూలుని 1.10.53 నుంచి 5 సంవత్స రాలపాటు యిచ్చినవి. ఈ కాలంలో రాష్ట్రంలో జైలువసతిని చాలినంతగా సమకూర్చుట కవసరమైన చర్యలు గైకొనబడుతున్నవి.

విజయవాడలో ఒక ఆక్సిలరీ హోం వుంది. దీనిలో 20 మందికి వసతి సౌకర్యం వుంది. ఆ వూళ్లోనే ఒక రిసెప్షన్ హోం వుంది. అందులో 100 మందికి వసతిసౌకర్యం వుంది. హైదరాబాదులో కె. వి. సి. హోం వున్నది. అందులో 50 మందికి వసతిసౌకర్యంవుంది. ఇవిగాక నెల్లూరులో ఒక రిసె ప్షన్ హోం వుంది. ఇది పురపాలకసంఘంచే నిర్వ హించబడుతున్నది. భోజనపుఖర్చులు మున్నగు వాటికై ప్రభుత్వం యేటా గ్రాంటునిస్తున్నది.

ఖర్చువిషయం జైళ్ళ ఇనస్పెక్టర్ - జనరల్ చేతిలోవుంది. ఆయన సాలుసరి ఆయవ్యయాల అంచనాలు మున్నగువాటిని తయారుచేసి, జైలు ఖర్చులకు సంబంధించిన బిల్లులన్నిటిని అక్కౌంటెంటు జనరల్‌కి పంపిస్తారు. చిన్నచిన్న నిర్మాణం పనులు, భవనాల మరమ్మతులు చేయించుటకు ఆయనకు అధి కారంవుంది. అలాగే ఆయన అధ్వర్యంక్రిందగల జైళ్ళు సక్రమంగా, పొదుపుగా నిర్వహింపబడుటకై ఆయన స్టోర్సు, కాగితాలు, కలాలు మున్నగు వస్తువులను కొనవచ్చు. అన్నప్రకారం పనిచేయని కంట్రాక్టర్లమీద, జైళ్ళకు రావలసిన డబ్బునిమిత్తం దావా వేయవచ్చు. సెంట్రల్‌జైళ్లు జిల్లా జైళ్ళు, నెల్లూరులోని స్పెషల్‌జైలు, రాజమండ్రిలోని స్త్రీల స్టేట్‌జైలు జైళ్ళ ఇనస్పెక్టరుజనరల్ ప్రత్యక్ష అజ

మాయిషీ, నిర్వహణలక్రింద వున్నాయి. సబ్-జైళ్లు జిల్లాకలక్టర్ల అధ్వర్యంలో వున్నాయి. అయితే వాటి విషయంలో వుత్తర ప్రత్యుత్తరాలుమాత్రం ఇనస్పెక్టరుజనరల్ ద్వారానే జరగాలి.

క్రమశిక్షణ, వ్యయం మున్నగు విషయాల నిర్వహణకై ప్రతి జైలుకి ఒక సూపరింటెండెంటు వున్నాడు. జైలర్ జైలుయొక్క ప్రధాన కార్య నిర్వాహక అధికారి. అయన సూపరింటెండెంటుకి క్రింద అధికారి. నిబంధనలు మున్నగువాటి పరిపాలన బాధ్యతను ఆయన వహిస్తారు. ఆయనక్రింద మళ్ళీ రిజర్వు డిప్యూటీజైలరు, గేటుకీపర్లు, వార్డర్లు మున్నగువారు, మినిస్టీరియల్ సిబ్బంది వుంటుంది. ఆంధ్రప్రాంతంలోని 128 సబ్-జైళ్లు రెండవతరగతి జుడీషియల్ మేజిస్ట్రేట్ల అధ్వర్యంలోను, తెలంగాణా ప్రాంతంలోని 40 సబ్-జైళ్లు మున్సబు మేజిస్ట్రేట్ల అధ్వర్యంలోను వున్నాయి.

జైలుజీవితానికి సంబంధించిన విషయాలు కొన్ని దిగువ యివ్వబడినవి :

సెంట్రల్ జైళ్లు, స్త్రీల స్టేట్ జెయిల్ లోని ఖైదీలందరికి 5వ స్టాండర్డువరకూ చదువనూ, వ్రాయనూ నేర్పబడుతుంది. లెక్కలుకూడా నేర్పబడుతాయి. తెలంగాణా ప్రాంతం జైళ్ళలో వయోజన విద్యా పధకం ప్రవేశపెట్టబడింది. సెంట్రల్ జైళ్ళలోని ఖైదీలకు అప్పుడప్పుడు మ్యాజిక్ లాంతరు వుపన్యాసాలు యివ్వబడుతూవుంటాయి. కుట్టివెల్లోడి పిల్లల హోంలోనివారికి హిందీ, సంగీతం నేర్పబడతాయి. బయట ప్రభుత్వ పరీక్షలకై చాలమంది బాలకులు తయారు చేయబడతారు. ప్రాంతీయభాషలలో దిన, వార పత్రికలు వగైరాకూడా సరఫరాచేయబడతాయి.

ఖైదీలకు వడ్రంగం, దర్జీపని, రంగులువేయటం, తోలుపని, నూలువడకడం మున్నగు పనులుకూడా నేర్పబడతాయి. ఇవి విడుదలైనతరువాత వారికి వుపకరించగలవు. వారిలో చాలమంది జైలు నౌకర్లుగా (అనగా వంటమనుషులు, మంగళ్లు, నీళ్లు మోసేవారు, పాకీవారు, బందీవార్డర్లు, బందీ రాత్రి కాపలా మనుషులుగా) నియమించబడతారు. కుట్టివెల్లోడి పిల్లల హోంలోనివారికి నేతపని, వడ్రంగం నేర్పబడతాయి. వారు బొమ్మల్నికూడా తయారు చేస్తారు. ఆంధ్రప్రదేశ్ జైళ్ళశాఖ పరిశ్రమలు, చేతి పనులు, అవి అమలుజరిగే జైళ్ళ వివరాలు దిగువ యివ్వబడినవి :

### హైదరాబాదు సెంట్రలు జైలు

1, దర్జీపని (విద్యుచ్ఛక్తిద్వారా)
2, పాదరక్షల తయారీ
3. వడ్రంగం
4. పేముపని
5. నేత (విద్యుచ్ఛక్తి ద్వారా)
6. రంగులు వేయుట
7, స్మిదీ

### వరంగల్లు సెంట్రల్ జైలు

1. వడ్రంగం
2. తివాసీ అల్లకం
3. నూలునేత, కంబళ్ల తయారీ
4. రంగులు వేయుట
5. స్మిదీ

### రాజమండ్రీ సెంట్రలు జైలు

1. దర్జీపని
2. వడ్రంగం
3. కంబళ్ల నేత
4. స్ట్రా కవర్ల తయారీ
5, బుక్ బైండింగు
6. నూలు వడకడం
7. తేనెటీగల పెంపకం, కోళ్ల పెంపకం

### విశాఖపట్నం సెంట్రలు జైలు

1. దర్జీపని
2. వడ్రంగం
3. నూలు నేత
4. జనపనార చాపల అల్లకం
5. బుక్ బైండింగ్
6. నూలు వడకడం
7. తేనెటీగల పెంపకం

## నెల్లూరులోని స్పెషల్ సబ్-జైలు

1. స్ట్రా కవర్ల తయారీ
2. దర్జీపని
3. నూలు వడకడం

---

### నైతికోపన్యాసాలు

అన్ని సెంట్రలు జైళ్లు, నెల్లూరులోని స్పెషల్-సబ్ జైలులోను వుపన్యసించుటకై ఇన్‌స్పెక్టర్-జనరల్ చే హిందూ, మహమ్మదీయ, క్రైస్తవులనుంచి గౌరవ వుపన్యాసకులు నియమించబడతారు. తెలంగాణా ప్రాంతంలో హైదరాబాదు సెంట్రలు జైలులోను, సికిందరాబాదు జిల్లా జైలులోను వుపన్యసించుటకు జీతంపై ఒక వుపన్యాసకుడు నియమింపబడ్డాడు. కె. వి. యస్. హోంలో బాలుల నైతిక ప్రమాణాన్ని పెంపొందించుటకై దయాళువులు, సాంఘిక సేవకులు చాలమంది నైతిక విషయాలపై వుపన్యసిస్తూ వుంటారు.

ఖైదీలు శాకాహారులు, మాంసాహారులు, కాయకష్టం చేసేవారు, చేయనివారు, బందీలు, విచారణలో నున్నవారు అని వివిధ తరగతులుగా విభజింపబడుతారు. ఆహారం వీరిలో ఒక్కొక్క తరగతికి నిర్ణయించబడిన విధంగా యివ్వబడుతుంది. జైళ్లకు కావలసిన కూరగాయలు సాధారణంగా జైళ్లలోనే కాపించబడతాయి. ప్రతి సెంట్రలు జైలుకి అనుబంధింపబడి ఒక ఆస్పత్రి వుంటుంది. ప్రత్యేక చికిత్స అవసరమైన ఖైదీలు జిల్లా ఆస్పత్రులకు పంపబడతారు.

### విభజన

ఖైదీలందరు ఎ. బి. సి. తరగతులుగా విభజించబడతారు.

మంచి నడవడి గలిగి తప్పిజారి జైలుకు వచ్చి వుండి, సాంఘిక హోదా, విద్య, జీవితంలో అలవాట్ల వల్ల పై తరగతి జీవితానికి అలవాటుపడి వుంటేనూ, క్రౌర్యం, నైతికపతనం లేక వ్యక్తిగత దురాశల ఫలితంగానూ, తీవ్రమైన లేక ముందుగా ఆలోచించి చేసిన దౌర్జన్యం ఫలితంగానూ, స్త్రీలు, పిల్లల పట్లనూ, ఆస్తిపట్లనూ చేసిన తీవ్రమైన నేరాల ఫలితంగానూ, నేరం చేసే వుద్దేశంతోకాని లేక నేరాన్ని ప్రోత్సహించే వుద్దేశంతోకాని మందుగుండు సామానులు, తుపాకులు, లేక అపాయకరమైన యితర ఆయుధాలను కలిగివున్న ఫలితంగానూ బంధింపబడి వుండకపోతే అట్టి ఖైదీలు 'ఎ' తరగతికి అర్హులు.

సాంఘిక హోదా, విద్య లేక జీవితంలో అలవాట్లవల్ల పై తరగతి జీవితానికి అలవాటుపడిన ఖైదీలు "బి" తరగతికి అర్హులు. ఖైదీలను తరగతివారీగా విభజించే అధికారి విచక్షణ ననుసరించి వారి వర్తన, వెనుకటి జీవితాన్నిబట్టి అలవాటుపడిన ఖైదీలుకూడా యీ తరగతిక్రింద చేర్చబడవచ్చు. "ఎ", "బి" తరగతులలో చేర్చబడనివారు "సి" తరగతిలో చేర్చబడతారు.

### ఆహారం

"ఎ", "బి" తరగతి ఖైదీలు తమ స్వంతఖర్చుతో పళ్లు, బిస్కట్లు, కోకా, ఓవల్టిన్‌వంటి వస్తువులను కొనుక్కుని వారికి నిర్ణీతంగాయిచ్చే ఆహారానికి తోడు తినవచ్చు.

### బట్టలు, పడక

"ఎ", "బి" తరగతుల ఖైదీలు వారివారి పడకలను, వర్కుషాపులలో పనిచేసేటప్పుడుతప్ప వారివారి దుస్తులను వుపయోగించవచ్చు. "సి" తరగతి ఖైదీలకు జైలుబట్టలు యివ్వబడతాయి. పురుషులకు పొట్టిచేతుల చొక్కా, పొట్టికాళ్ళలాగు, టోపీ, లంగోటా యివ్వబడతాయి. స్త్రీలకు 8 గజాల పొడుగు, 42 అం. వెడల్పుగల బట్ట, ఒక రవిక యివ్వబడతాయి.

### టాయ్‌లెట్ సామాన్లు

"ఎ", "బి" తరగతుల ఖైదీలు తమ స్వంత ఖర్చుపై సబ్బులు, తలనూనెలు వాడుకోవచ్చు.

జైళ్లలో వారివారి ప్రవర్తననుబట్టి 'సి' తరగతి ఖైదీలకుకూడా యీ సౌకర్యం అనుమతించబడుతుంది.

## ఉత్తరాలు వగైరా

'సి' తరగతి ఖైదీలను చూచుటకు వారి బంధుమిత్రులు పక్షానికి ఒకసారి రావచ్చును. వారు నెలకు రెండు వుత్తరాలు వ్రాసుకోవచ్చు. 'ఎ' 'బి' తరగతుల ఖైదీలను చూచుటకు వారి బంధుమిత్రులు పక్షానికొకసారి రావచ్చు, వారు వారానికొకసారి వుత్తరాలు వ్రాసుకోవచ్చు. వారాని కొకసారి వారికి వుత్తరాలు రావచ్చు.

## వార్తాపత్రికలు

అన్నితరగతుల ఖైదీలుకూడా తమ తమ స్వంత డబ్బుతో వార్తాపత్రికలను కొనుక్కోవచ్చు. అయితే వార్తాపత్రికలు వగైరా ద్వారంవద్ద తనిఖీచేయబడాలి. 'ఎ', 'బి' తరగతుల ఖైదీలు వార, పక్ష, మాస పత్రికలు వగైరాకూడా తమ స్వంతడబ్బుతో కొనుక్కోవచ్చు. జైలు అవతలనుంచి వారు పుస్తకాలుకూడా తెచ్చుకోవచ్చు.

## శిక్ష తగ్గింపు

బందీలందరికీ మాన్యుయల్‌లలో నిర్ణయమైన రీతిగా (ఆంధ్రప్రాంతంలో నెలకు 4 రోజులు, తెలంగాణాప్రాంతంలో నెలకు 5 రోజులు) శిక్ష తగ్గించబడుతూవుంటుంది. ప్రతి జైలుకు ఒక సలహాసంఘం వుంటుంది. దాని సిఫార్సుననుసరించి ప్రభుత్వం బందీలను శిక్ష పూర్తికాకుండానే విడిచిపెడుతుంది. దీర్ఘకాలం శిక్ష విధింపబడినవారు, 3 సంవత్సరాలకు మించిన కఠినశిక్షను అనుభవించేవారి విషయంలో వారు మూడింట రెండువంతుల శిక్ష ననుభవించిన మీదటను, స్వల్పకాలిక శిక్ష ననుభవించేవారి విషయంలో వారు నాలుగింట మూడువంతులశిక్ష ననుభవించినతరువాతను సలహాసంఘం పరిస్థితిని సమీక్షించి వారిని అప్పుడు యింక విడిచిపెట్టవచ్చుననో లేక వద్దనో ప్రభుత్వానికి సిఫార్సుజేస్తుంది. ఈ సిఫార్సు నేరం స్వభావాన్ని, అదిజరిగిన పరిస్థితులను, దానికి విధింపబడిన శిక్షను, జైలులో బందీ నడవడికను, అతని గతచరిత్రను, విడుదలవల్ల శాంతిభద్రతలకు కలిగే లాభనష్టాలనుబట్టి వుంటుంది.

## విజిటర్లు

మేజిస్ట్రీరియల్, జుడిషియల్; వైద్య, ఆరోగ్య, పరిశ్రమలశాఖలనుంచి జైళ్ళ సందర్శనకై ఎక్స్ అఫీషియో విజిటర్లు నియమింపబడతారు. వీరుకాక అనధికార విజిటర్లుగా జైళ్ళను సందర్శించుటకై ప్రజలలో ప్రముఖులైనవారు నియమింపబడతారు. అనధికారసభ్యులు సాధారణంగా విడుదలైన ఖైదీల సహాయసంఘం సభ్యులైవుండి, ఖైదీల సంక్షేమంపట్ల శ్రద్ధాసక్తులు చూపినవారై వుంటారు. ఈ విజిటర్లు జైలు అన్నిభాగాలను సందర్శించాలి. అక్కడగల అందరు ఖైదీలను చూడాలి. ఎవరైనా యేమైనా ఫిర్యాదుచేస్తేవిని, దానివిషయంలోదర్యాప్తు చేయాలి. ఖైదీలు, జైళ్ళనిర్వహణకి సంబంధించిన నిబంధనావళి సక్రమంగా అమలుపరచబడుతున్నదోలేదో చూడాలి

## ప్రొబేషను

ప్రొబేషను పనిలో దిగువ విషయాలుంటాయి. గృహపరిస్థితులు మున్నగువాటిని దర్యాప్తు చేయడం. న్యాయస్థానాల ఆదేశాలక్రింద నేరస్థుల్ని అజమాయిషీ చేయడం. బోర్‌స్టల్ స్కూళ్లు, సర్టిఫైడు, స్కూళ్లు, విజిలెన్సు హోమ్‌లనుండి లైసెన్సుమీద కాని లేక శిక్ష పూర్తిఅయిన పిమ్మటకాని విడుదలైనవారిని, క్రి. ప్రొ. కో. (మెయింటనెన్సు కేసులు) **XXXVI** అధ్యాయం క్రిందకు వచ్చేవారిని అజమాయిషీ చేయడం.

మైసూరు, మద్రాసు ప్రభుత్వాలు లభింపచేసిన జైళ్లతో సహా రాష్ట్రంలోని వివిధరకాల జైళ్లలో గల వసతి సౌకర్యం వివరాలు దిగువ యివ్వబడినవి.

## వసతి సౌకర్యం

| | |
|---|---|
| విశాఖపట్నం సెంట్రల్ జైలు | 762 |
| రాజమండ్రి ,, ,, | 1212 |
| హైదరాబాదు ,, ,, | 782 |
| వరంగల్లు ,, ,, | 521 |
| రాజమండ్రిలోని స్త్రీల స్టేట్ జైలు | 200 |
| నెల్లూరు స్పెషల్ సబ్-జైలు | 145 |
| బళ్లారిలోని అలిపురం జైలు | 1171 |
| బళ్లారిలోని బోర్‌స్టల్ స్కూలు | 200 |
| బళ్లారి జూనియర్ సర్టిఫైడు స్కూలు | 280 |
| చెంగల్పట్టు సీనియర్ ,, ,, | 630 |

# రాష్ట్రంలో సహకారోద్యమం అభివృద్ధి

**రాష్ట్రంలో వ్యవసాయ పరపతి, మార్కెటింగు, చిన్నరకం పరిశ్రమలు, గృహ వసతి, మురికిపేటల తొలగింపు రంగాలలో సహకారోద్యమం స్థిరంగా పురోగమిస్తున్నది. సహకారోద్యమం ఉపకరించే గ్రామాలు, గ్రామీణుల జనాభాలశాతం దినదినాభివృద్ధిని పొందుతున్నది. 1958-59 లో సహకార పరపతి, మార్కెటింగు, శిక్షణ, వ్యవసాయాల అభివృద్ధి పథకాలకై రు. 75.19 లక్షలు కేటాయించబడగా అదనంగా మరొక రు. 85 లక్షలు సహకార సంఘాల వాటామూలధనంగా ఇవ్వవలసివుంది.**

ఆంధ్ర ప్రాంతంలో సహకారోద్యమం ఉపకరించే గ్రామాలు, గ్రామీణుల జనాభాల శాతం క్రమేణా హెచ్చుతున్నది. 31-3-58 నాటికి వీటి శాతాలు వరుసగా 66.7, 20.00. ఈ సంవత్సరంలో అవి వరుసగా 72.5, 23.7 కి హెచ్చాయి. 1959 మార్చి నెలాఖరు నాటికి వాటిని వరుసగా 75 కి, 33 కి హెచ్చించుటకు కృషి సలుపబడుతున్నది. ఈ సంవత్సరంలో 81 పెద్ద రకం సంఘాలు స్థాపించబడినవి.

1957-58 లో రైతులకు అప్పులుగా దిగువ మొత్తాలు ఇవ్వబడినవి:—

| | | |
|---|---|---|
| 1. | స్వల్పకాలిక ఋణాలు | రు. 665 లక్షలు |
| 2. | మధ్యకాలిక ఋణాలు | రు. 168 ,, |
| 3. | దీర్ఘకాలిక ఋణాలు | రు. 75 ,, |

ఇవిగాక సరుకు పుచ్చుకునే పద్ధతిపై మరి రు. 322 లక్షలవరకూ స్వల్పకాలిక ఋణాలు ఇవ్వబడినవి.

45 మార్కెటింగు సహకార సంఘాల వాటా మూలధనం నిమిత్తం, 46 గిడ్డంగుల నిర్మాణం నిమిత్తం 7 ప్రోసెసింగు యంత్రాల స్థాపన నిమిత్తం రు. 12.92 లక్షలు అప్పుల రూపంలోను, గ్రాంట్ల రూపంలోను ఇవ్వబడినవి.

1958-59 లో 60 పెద్దరకం సంఘాల్ని ఏర్పర చాలనీ, స్వల్పకాలిక ఋణాల మొత్తాన్ని రు. 830 లక్షలకు, మధ్యకాలిక ఋణాల మొత్తాన్ని రు. 100 లక్షలకు హెచ్చించాలనీ నిర్ణయించబడింది. రు. 110 లక్షల వరకూ దీర్ఘకాలిక ఋణాలుకూడా ఇవ్వబడతాయి.

మార్కెటింగు సొసైటీలు 15 గిడ్డంగులను పెద్దరకం సంఘాలు 20 గిడ్డంగులను నిర్మించుటకు, దిగువ 11 ప్రోసెసింగు యంత్రాలను నెలకొల్పుటకు వాటికి ఋణాలు, గ్రాంటులరూపంలో ఆర్థిక సహాయం చేయబడుతుంది.

| | |
|---|---|
| వేరుసెనగ తొక్కఒలిచే యంత్రాలు | 2 |
| ప్రత్తి యంత్రాలు | 2 |
| ప్రత్తి ప్రెస్సు | 1 |
| నూనె మిల్లు | 1 |
| చెఱకు గానుగలు | 5 |

25 ప్రాథమిక మార్కెటింగు సొసైటీలకు ఒక్కొక్కదానికి రు. 20,000 చొప్పున వాటా మూలధనం ఇవ్వబడుతుంది. ఎపెక్సు మార్కెటింగు ఫెడరేషన్‌కి అది రు. 1 లక్షవరకూ ఇవ్వబడుతుంది.

ఇదిగాక, తూర్పు గోదావరి జిల్లాలో 3 కొబ్బరి మార్కెటింగు సొసైటీలను ఏర్పాటు చేయడానికి, గుంటూరు జిల్లాలో పొగాకు ఉత్పత్తిదారుల సహకార సంఘానికి ఆర్థిక సహాయం చేయడానికి సంబంధించిన పథకాలు ప్రభుత్వ పరిశీలనలో ఉన్నాయి. కొబ్బరి మార్కెటింగు సొసైటీలు ప్రతి ఒక్కదాని

లోను జింక్ కప్పుగల గిడ్డంగి ఉంటుంది. దానిలో కొబ్బరిని ఎండబెట్టే సాధనము ఉంటుంది. పొగాకు ఉత్పత్తిదారుల సహకార సంఘానికి ఆర్థిక సహాయం చేస్తే 2 'రీడ్రైయింగ్' యంత్రాలు నెలకొల్పబడతాయి. సహకార సిద్ధాంతాలు, వాటిని అమలుపరచే విధానంలోను, సంస్థల నిర్వహణ, జమా ఖర్చుల వ్రాత కోతలు మున్నగువాటిలోను గ్రామ పరపతి సంఘాల సభ్యులు, పంచాయతీదార్లు, అధ్యక్షులు, కార్యదర్శులు, జీతంమీద పనిచేసే ఉద్యోగులకు శిక్షణ ఇచ్చే ఏర్పాటు చేయబడుతుంది. పశ్చిమ గోదావరి జిల్లా శంఖుచక్ర పురంలోను, కొల్లేరు సరస్సు ప్రాంతంలోను సహకార వ్యవసాయ సంఘాల ఏర్పాటుకి సంబంధించిన పథకాలుకూడా ప్రభుత్వ పరిశీలనలో ఉన్నాయి.

1957-58 లో తెలంగాణా ప్రాంతంలో 30 పెద్దరకం సంఘాలు, 407 చిన్నరకం సంఘాలు, 4 ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులు, 7 మార్కెటింగు సొసైటీలు ఏర్పాటు చేయబడ్డాయి.

దిగువ ఋణాలు ఇవ్వబడినవి:—

| | | |
|---|---|---|
| 1. స్వల్పకాలిక ఋణాలు | రు. 94 | లక్షలు |
| 2. మధ్యకాలిక ఋణాలు | రు. 5 | ,, |
| 3. దీర్ఘకాలిక ఋణాలు | రు. 8 | ,, |

మార్కెటింగు సొసైటీలకి వాటా మూలధనం నిమిత్తం రు. 70,000 ఇవ్వబడ్డాయి. సహకార సంస్థలకు అప్పులు, సబ్సిడీలుగా రు. 62,500 మంజూరు చేయబడినవి. గిడ్డంగుల నిర్మాణానికై రు, 22,500 ఇవ్వబడినవి.

జరిగే సంవత్సరంలో 40 పెద్ద రకం సంఘాలు, 175 పరపతి సంఘాలు, 10 ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులు ఏర్పాటు చేయబడతాయి,

దిగువ మొత్తాలు అప్పులుగా ఇవ్వబడ గలవు:—

| | | |
|---|---|---|
| 1. స్వల్పకాలిక ఋణాలు | రు. 116 | లక్షలు |
| 2. మధ్యకాలిక ఋణాలు | రు. 21 | ,, |
| 3. దీర్ఘకాలిక ఋణాలు | రు. 23 | ,, |

ఈ సంవత్సరంలో 20 మార్కెటింగు సొసైటీలు ఏర్పాటు చేయబడతాయి. వీటిలో ఒక్కొక్కదానికి వాటా మూలధనం నిమిత్తం రూ. 10,000 చొప్పున ప్రభుత్వం ఇస్తుంది. 28 గిడ్డంగుల నిర్మాణానికి ఆర్థిక సహాయం చేయబడుతుంది. 8 సహకార వ్యవసాయ సంఘాలు ఏర్పాటు చేయబడతాయి. రు. 1 లక్ష వరకూ ధనసహాయం సమకూర్చ బడుతుంది.

సహకార పరపతి, మార్కెటింగు, శిక్షణ, వ్యవసాయాలకు సంబంధించియిప్పుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అమలుజరుగుతున్న పథకాలకు 1958-59 లో రు. 75.19 లక్షలు కావాలి. ఇదిగాక రాష్ట్రంలోని సహకార సంఘాల వాటా మూలధనం నిమిత్తం రూ. 85 లక్షలను ఇవ్వాలని సంకల్పం.

ఇండియా రిజర్వుబ్యాంకు 100 కి 2 వంతుల చొప్పున ప్రత్యేక సౌకర్యం (కన్సెషనల్) పెట్టుబడిని లభింపచేస్తున్నది. సహకార సంఘాలలో రైతు సభ్యుల వ్యవసాయం పనులు మున్నగువాటికి అవసరమైన సొమ్ము ఇచ్చుటకు ఇది చాలా తోడ్పడుతున్నది. విజయవాడలోని ఆంధ్రా స్టేట్ సహకార బ్యాంకి 1958-59 లో పరపతికి రు, 150.00 లక్షల పరిమితిని సంపాదించింది. హైదరాబాదులోని హైదరాబాదు స్టేట్ సహకార బ్యాంకి రు. 200.00 లక్షల్ని పొందింది.

ఆంధ్రా స్టేట్ సహకార బ్యాంకికి రు. 35 లక్షలు, హైదరాబాదు ఎపెక్సు సహకార బ్యాంకికి రు. 12 లక్షలు ప్రభుత్వ హామీపై మధ్య కాలిక ఋణాలుగా మంజూరు చేయబడినవి. బాకీలను సత్వరం రాబట్టుకొనుటకు అనువుగా అదనపు సూపర్ వైజర్ల నియామకానికి ప్రభుత్వం ధన సహాయం చేస్తున్నది.

తెలంగాణా ప్రాంతంలోని భూమి తనఖా సంఘాల నిమిత్తం డిప్యూటీ రిజిస్ట్రారు కార్యాలయం కొత్తగా 1958 ఆగస్టులో తెరువబడింది. దాని ముఖ్య కార్యాలయం హైదరాబాదులో ఉన్నది. ప్రాథమిక భూమి తనఖా సంఘాలకై కరీంనగరం

ముఖ్య కార్యాలయంగా సబ్-రిజిస్ట్రార్ల ఉద్యోగాలు మరి రెండు ఏర్పరుచ బడినవి.

ఈ సంవత్సరం 31-7-58 వరకూ 65 పెద్దరకం సంఘాలు నెలకొల్పబడినవి.

మద్రాసు, విశాఖపట్నం రేవులలో రసాయన ఎరువుల బస్తాలను వాగన్‌లలోకి ఎక్కించుటను అజమాయిషీ చేసే పనికి సంబంధించి ఇద్దరు మార్కెటింగు అసిస్టెంట్ల నియామకం మంజూరు చేయబడింది.

## తక్కువరాబడి వర్గాల గృహవసతి

తక్కువరాబడి వర్గాల గృహవసతి పథకానికి కేంద్ర ప్రభుత్వం సహాయం చేస్తుంది. ఈ పథకం క్రింద సాలుసరి ఆదాయం రూ. 6000 మించని వారికి ఒక్కొక్క గృహానికి నిర్మాణం ఖర్చులో 100 కి 80 వంతుల వరకూ, రూ. 8,000 మించకుండా అప్పు ఇవ్వబడుతుంది. మిగిలిన 20 వంతులను గృహం ఉద్దేశించబడినవారు లేక నిర్మాత అనగా రాష్ట్ర ప్రభుత్వం (ఏజన్సీగా), స్థానిక సంస్థ, సహకార గృహ నిర్మాణ సంఘం లేక సంస్థ భర్తీ చేయవలసి ఉంటుంది.

## 1958-59 కి తక్కువరాబడి వర్గాల గృహ నిర్మాణానికి జరిగిన కేటాయింపు

తెలంగాణా ప్రాంతం :----

| | |
|---|---|
| ప్రభుత్వ విభాగం | రూ. 17.00 లక్షలు |
| మునిసిపలు విభాగం | రూ. 1.80 లక్షలు |
| సహకార విభాగం | రూ. 13.00 లక్షలు |

ఆంధ్ర ప్రాంతం :—

| | |
|---|---|
| సహకార సంఘాలు | రూ. 20.00 లక్షలు |
| స్థానిక సంస్థలు | రూ. 7.00 లక్షలు |
| మొత్తం | రూ. 58.80 లక్షలు |

## ప్రభుత్వ విభాగం

1958-59 కి కేటాయించబడిన రు. 17.00 లక్షలలో రు. 11.95 లక్షలు ద్వితీయ ప్రణాళికలో సంకల్పించబడిన 1,216 గృహాలలోను 166 గృహాల నిర్మాణాన్ని పూర్తిచేయుటకై ఖర్చు చేయబడగలవు. మిగిలిన రు. 5.05 లక్షలు క్రొత్త మల్లేపల్లి గృహ నిర్మాణ పథకం (రెండవ అంచె) పైనను యితర జిల్లా పథకాల పైనను ఖర్చు పెట్టాలని సంకల్పం. జిల్లా పథకాలలో ద్వితీయ ప్రణాళికలో సంకల్పించబడిన 241 గృహాలలోను 65 గృహాల నిర్మాణం పూర్తిచేయబడుతుంది.

## సహకారవిభాగం

1958-59 కి ఆంధ్రప్రాంతంలో బడ్జెట్ కేటాయింపు రు. 20.00 లక్షలు. రు. 16.35 లక్షలు గడచిన సంవత్సరాలలో మంజూరైన అప్పులు యివ్వడానికి ఉపయోగింపబడతాయి. ఇప్పటివరకూ మొత్తం 18.29 లక్షల అప్పులు మంజూరు చేయబడ్డాయి. డిప్యూటీ రిజిస్ట్రార్లు మంజూరైన అప్పులను తీసుకొనే పనిని చూస్తున్నారు. సంవత్సరాంతంలోగా బడ్జెట్ కేటాయింపు పూర్తిగా వినియోగించబడుతుంది. ఈ పథకాన్ని ప్రజలు బాగా వినియోగించుకుంటున్నందున దీనికి అదనంగా సొమ్ము అవసరం. దీనిని సమకూర్చే విషయం ప్రభుత్వ పరిశీలనలో వున్నది.

1958 జూన్‌లో 71 గృహాల నిర్మాణం జూలైలో 9 గృహాల నిర్మాణం పూర్తిఅయింది. దీనితో జరిగే ఆర్థిక సంవత్సరంలో పూర్తిఅయిన గృహాల మొత్తం సంఖ్య 143 కి, ద్వితీయపంచవర్ష ప్రణాళికలో క్రమేణా పూర్తిచేయబడిన గృహాల సంఖ్య 521 కి చేరింది. 31-7-1958 నాటికి 254 గృహాల నిర్మాణం వేర్వేరు దశల్లో కొనసాగుతున్నది. ద్వితీయ ప్రణాళికలో జరిగే సంవత్సరం లక్ష్యం 280.

1958-59 కి తెలంగాణా ప్రాంతానికి బడ్జెట్ కేటాయింపు రు. 13.00 లక్షలు. ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో యింతవరకూ రు. 4.74 లక్షలు మంజూరైనవి. 1958 జూలై మాసాంతానికి 98 గృహాలు

పూర్తిచేయబడగా 194 గృహాల నిర్మాణం వేర్వేరు దశలలో కొనసాగుతున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో యింతవరకూ నిర్మింపబడిన గృహాల మొత్తం సంఖ్య 258. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో జరిగే ఆర్థిక సంవత్సరానికి నిర్ణయించబడిన లక్ష్యం 200 గృహాలు.

## స్థానిక సంస్థలు

ఆంధ్ర ప్రాంతంలోని 10 స్థానిక సంస్థలకు 148 గృహాల నిర్మాణం నిమిత్తం 1958-59 లో రూ. 7 లక్షల అప్పులు యివ్వాలని ప్రభుత్వం నిశ్చయించింది. జూలై నెలలో వీటిలో రూ. 6.86 లక్షల వరకూ మంజూరు చేయబడినవి.

ద్వితీయప్రణాళిక మిగిలిన రెండు సంవత్సరాలకు చేసిన కేటాయింపు చాలదని భావించబడినందున, ప్రణాళిక మిగిలిన రెండు సంవత్సరాలకి తక్కువ రాబడి వర్గాల గృహ నిర్మాణ పథకం క్రింద ప్రణాళికా కేటాయింపును రూ. 100 లక్షలకు హెచ్చించుటకై ప్లానింగ్ కమిషన్ ఆమోదాన్ని సంపాదించవలెనని కేంద్ర ప్రభుత్వానికి వ్రాయబడింది. కేంద్ర ప్రభుత్వం జవాబు యింకా రాలేదు.

## గ్రామీణ గృహవసతి

గ్రామీణ గృహవసతి ప్రాజెక్టు పథకాన్ని కేంద్ర ప్రభుత్వం ప్రారంభించింది. ఈ పథకం క్రింద 1958-59 లో ఒక దాని ప్రక్క ఒకటిగల 5 గ్రామాలలో 9 బ్లాక్‌లు నిర్ణయించబడినవి. నిర్మాణ వ్యయం లో సగం రొక్కంలేక వస్తులేక శ్రమ రూపంలో రావలసి వున్నది. కొత్తగా నిర్మించబడే యింటికి కాని లేక పునర్నిర్మింపబడే యింటికి గాని అప్పు రూ. 1,500 మించి యివ్వబడదు.

రాష్ట్ర ప్రభుత్వం రాజధానిలో గ్రామీణ గృహ వసతి యూనిట్టును, జిల్లాలకు ప్రాంతీయ యూనిట్టులను యేర్పరచింది. అవి టౌన్ ప్లానింగ్ డైరెక్టరు అధ్వర్యంలో పని ప్రారంభించాయి.

ఈ గ్రామీణ గృహ వసతి ప్రాజెక్టు పథకం అమలుకై కేంద్ర ప్రభుత్వం రూ. 7 లక్షల్ని కేటాయించింది. ఇందులో రూ. 6.60 లక్షలు కేంద్ర సహాయం గాను, రూ. 40,000 గ్రామీణ గృహ వసతి యూనిట్టుకి కేంద్రం వాటాగాను ఉంటాయి. 1958-59 లో కేంద్ర ప్రభుత్వం మన రాష్ట్రానికి 135 గ్రామాలను కేటాయించింది. వాటిలో 38 రాష్ట్ర ప్రభుత్వంచే యెన్నబడినవి.

## పారిశ్రామిక గృహవసతి

సబ్సిడైజుడు పారిశ్రామిక గృహావసతి పథకం కేంద్ర వర్క్సు, గృహావసతి, సప్లయి మంత్రిత్వ శాఖచే ప్రారంభింపబడి కేంద్ర ప్రభుత్వం సహాయం పొందుతున్న పథకం. ఈ పథకం క్రింద రాష్ట్ర ప్రభుత్వానికి ఒక ప్రాజెక్టుకి దాని ఖర్చులో సగం అప్పుగాను, మిగిలిన సగం సబ్సిడీగాను కేంద్ర ప్రభుత్వం నుంచి లభిస్తుంది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఆంధ్ర ప్రాంతంలో 1,478 యిళ్లు, తెలంగాణా ప్రాంతంలో 6,347 యిళ్లు నిర్మింపబడాలని సంకల్పించబడగా ఆ ప్రాంతాలలో వరుసగా 300, 2,367 పూర్తి చేయబడినవి. తెలంగాణాలో జూలై నెలలో మరి 53 యిళ్లు పూర్తిచేయబడినవి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో సబ్సిడైజుడు పారిశ్రామిక గృహావసతి పథకానికి రూ. 181.83 లక్షలు కేటాయించబడినవి. ఇందులో రూ. 42.77 లక్షలు ఆంధ్ర ప్రాంతానికి, రూ 139.06 లక్షలు తెలంగాణా ప్రాంతానికి కేటాంచబడినవి. ఆంధ్ర ప్రాంతంలో విజయవాడలో 300 యిళ్లు నిర్మించబడ్డాయి. ఆంధ్ర ప్రాంతంలో రూ. 8.10 లక్షలతో దిగువ ప్రదేశాలలో మరి 300 యిళ్లను నిర్మించాలనే ప్రతి పాదనను ప్రభుత్వం ఆమోదించింది.

| | | |
|---|---|---|
| రాజమండ్రి | ... | 100 యిళ్లు |
| ఆదోని | ... | 100 „ |
| గూడూరు | ... | 50 „ |
| నంద్యాల | ... | 50 „ |

రాజమండ్రి, ఆదోని, గూడూరులలో పని జరుగుతున్నది. కొన్ని చిక్కులవల్ల నంద్యాలలో పని ప్రారంభించుటకు వీలులేక పోయింది. ప్రారంభమైన వాటి నిర్మాణం 31-12-58 నాటికి పూర్తి కాగలదని భావించ బడుతున్నది.

జరిగే ఆర్థిక సంవత్సరంలో దిగువ ప్రదేశాలలో 510 యిళ్లను నిర్మించాలని సంకల్పం.

| | | |
|---|---|---|
| గుంటూరు | ... | 150 |
| విశాఖపట్నం | ... | 150 |
| బుగ్గనపల్లి | ... | 110 |
| గుంతకల్లు | ... | 100 |
| | ... | 510 |

1958-59 కి అప్పుగా రు. 15 లక్షలు, సబ్సిడీగా రు. 12 లక్షలు కేంద్రప్రభుత్వం కేటాయించింది. ఈ యిళ్లకు సౌకర్యాలు కల్పించుటకు రాష్ట్ర ప్రభుత్వ కోశం నుంచి రు. 5.08 లక్షలు ఖర్చు చేయాలని సంకల్పించ బడింది.

## మురికిపేటల తొలగింపు

మురికిపేటల తొలగింపు పథకాన్ని కేంద్రవర్క్సు గృహావసతి, సప్లయి మంత్రిత్వశాఖ ప్రారంభించింది. ఈ పథకం క్రింద రాష్ట్ర ప్రభుత్వానికి ఒక ప్రాజెక్టు ఖర్చులో సగం అప్పుగాను, నాలుగవ వంతు సబ్సిడీగాను లభిస్తుంది. మిగిలిన నాలుగో వంతును రాష్ట్ర ప్రభుత్వం మాచింగు సబ్సిడీగా భరించవలసి వుంటుంది. ద్వితీయ ప్రణాళిక క్రింద మొత్తం రు. 102.67 (రు. 25 లక్షలు రాష్ట్ర ప్రభుత్వం వాటా, రూ. 77 లక్షలు కేంద్ర సహాయం) కేటాయించబడినవి. జరిగే ప్రణాళికా కాలానికి ఆంధ్ర ప్రాంతానికి రూ. 51.54 లక్షలు. తెలంగాణా ప్రాంతానికి రూ. 50.41 లక్షలు కేటాయించబడినవి.

1957-58 లో హైద్రాబాదు నగరంలో నగరాభివృద్ధి సంఘంచే యాకుత్పూరా మురికిపేటల తొలగింపు ప్రాజెక్టు చేపట్టబడింది. గడచిన యేడాది దీనిపై రూ. 2,26,000.00 ఖర్చు పెట్టబడినవి. జరిగే ఆర్థిక సంవత్సరంలో దోమలగూడా మురికిపేటల తొలగింపు ప్రాజెక్టును అమలుపరచాలని నగరాభివృద్ధి సంఘం సంకల్పించింది. హైద్రాబాదు, సికిందరాబాదు మునిసిపలు కార్పొరేషన్లు చేపట్టే పథకాలు కేంద్ర ప్రభుత్వం ఆమోదానికై అప్పుడే పంపబడినవి. సికిందరాబాదు మునిసిపల్ కార్పొరేషను పథకాన్ని కేంద్రప్రభుత్వం ఆమోదించింది. హైదరాబాదు మునిసిపలు కార్పొరేషను పథకం మాత్రం యింకా ఆమోదింపబడవలసివున్నది. ఈ యేటికి 204 యిళ్ల నిర్మాణం 200 ప్లాట్ల అభివృద్ధి లక్ష్యంగా నిర్ణయించబడగా 1958 జూలై మాసాంతానికి 200 కప్పులుగల యిళ్లు నిర్మించబడి, 118 ప్లాట్లు అభివృద్ధి పరచబడినవి.

ఆంధ్ర ప్రాంతానికి టౌన్ ప్లానింగు డైరెక్టరు 4 పైలట్ పథకాలను రూపొందించారు. అవి యివి.

1. విశాఖపట్నం మురికిపేటల తొలగింపు పథకం,
2. విజయవాడ మురికిపేటల తొలగింపు పథకం,
3. గుంటూరు మురికిపేటల తొలగింపు పథకం,
4. రాజమండ్రి మురికిపేటల తొలగింపు పథకం.

వీటిలో మొదటి 3 పథకాలను కేంద్ర ప్రభుత్వం ఆమోదించింది. రాజమండ్రి పథకం కేంద్ర ప్రభుత్వపు గృహావసతి సలహాదారు సలహానుసరించి మార్చబడుతున్నది. చీరాలకి సంబంధించిన మరొక పథకం కూడా ఆమోదించబడవలసివుంది. రాష్ట్రంలో మురికిపేటల తొలగింపు పథకాలపై రూ. 16 లక్షల్ని ఖర్చుచేయాలని సంకల్పించబడింది. జరిగే ఆర్థిక సంవత్సరంలో కేంద్ర ప్రభుత్వం రూ. 12 లక్షలను కేటాయించింది. ఇందులో రు. 8 లక్షలు అప్పు (సగం అప్పు)గాను, 4 లక్షలు సబ్సిడీ (నాలుగోవంతు సబ్సిడీ) గాను కేటాయించింది. మిగిలిన నాలుగో వంతు రూ. 4.00 లక్షలను రాష్ట్ర ప్రభుత్వం భరించవలసివుంది.

-:oOo:-

# ప్రశ్నోత్తరావళి

ప్రశ్న 1. (శ్రీ బి. ఆర్. ప్రసాద్, నెల్లూరు).
ఆంధ్రప్రదేశ్ లో మత్స్యశాఖ యేమిపని చేస్తుంది ? ఈ శాఖకు యేమైనా పరిశోధన కేంద్రాలున్నాయా ? వివరాలు తెలియ చేయండి.

జవాబు: సముద్రంలోను, చెరువులవంటి యితర వనరులలోను గల మత్స్యసంపదను పరిరక్షించుటకు, దానిని వృద్ధిచేయుటకు అవసరమైన అన్నిరకాల చర్యలను తీసుకుంటుంది మత్స్యశాఖ. ఉత్తమ పద్ధతులలో చేపలను పట్టి వుత్తమమైన విధానంలో వాటిని అమ్ముకొనుటకై యీ శాఖ మత్స్య పారిశ్రామికులకు తోడ్పడుతుంది కూడా. ప్రస్తుతం పరిశోధన కేంద్రాలేమీ లేవుకాని ద్వితీయ ప్రణాళిక క్రింద కొన్నిటిని ప్రారంభించాలని సంకల్పించ బడింది.

ప్రశ్న 2. (శ్రీ టి. చెంచు రామయ్య, వాల్తేరు).
సోషలిస్టు పద్ధతి సమాజం అంటే అర్థం యేమిటి ? అట్టి సమాజంలో ప్రైవేటు విభాగం పాత్రయేమిటి ?

జవాబు: సోషలిస్టు పద్ధతి సమాజం అంటే సమానావకాశాలు, సాంఘిక న్యాయం, పనిచేసే హక్కు, జీవన వేతనం తీసుకునే హక్కులు ప్రాతిపదికగా గల సాంఘిక వ్యవస్థ. అట్టి వ్యవస్థలో పథక నిర్మాణం ఆశయంసాంఘిక లాభమే కాని ప్రైవేటులాభం కాదు. అట్టి సంఘంలో సంపదవుత్పత్తిలోప్రైవేటు విభాగం ముఖ్యపాత్ర వహిస్తుంది, యెందువల్లనంటే పనులను ప్రారంభించి నడుపుటకు వుత్పత్తి రంగాలు తగినన్ని వుండగలవు. వాటి పరిమాణం కూడా తగినంత వుండగలదు.

ప్రశ్న 3. సింగరేణి బొగ్గుగనులలోను, నిజాం పంచదార ఫ్యాక్టరీలోను యెంతమంది పని చేస్తున్నారో చెప్పగలరా ?

జవాబు: సింగరేణి బొగ్గుగనుల కంపెనీ యించుమించు 30,000 మంది కార్మికులకు, నిజాం పంచదార ఫ్యాక్టరీ యించుమించు 18,000 మంది కార్మికులకు పని చూపెడతాయి.

ప్రశ్న 4. తగినంత సాలుసరి ఆదాయంగల గ్రామ పంచాయతీలు తెలంగాణాలో యెన్ని వున్నాయి ?

జవాబు: తెలంగాణా జిల్లాలన్నిటిలోను మొత్తం 53 గ్రామ పంచాయతీ కమిటీలు వున్నాయి. వాటికి సాలీనా రూ. 5,000, అంతకుపైన ఆదాయం వస్తుంది.

ప్రశ్న. 5 ఇప్పుడు మనం అమలు పరుస్తున్న పంచవర్ష ప్రణాళికల ఫలితంగా భారతదేశపు జాతీయ ఆదాయం బాగా హెచ్చుతుందా?

జవాబు: ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రారంభం నాటికి భారతదేశపు జాతీయ ఆదాయం యించుమించు రూ. 10,800 కోట్లు అని అంచనా వేయబడింది. తొలి పంచవర్ష ప్రణాళిక ఆరంభం నాటికి గల ఆదాయం కంటె యిది 100 కి 18 వంతులు యెక్కువ. ద్వితీయ ప్రణాళిక ఫలితంగా యిప్పుడు జాతీయ ఆదాయం 100 కి 25 వంతులు హెచ్చగలదని అంచనా, అనగా

1960-61 నాటికి అది యించుమించు రూ. 18,480 కోట్లు కాగలదు ఇది అంత యెక్కువ కాకపోవచ్చు కాని యిందుతో బాగా ఒక పెద్ద అడుగుముందుకు పడగ లదు.

ప్రశ్న 6. ద్వితీయ ప్రణాళికలో సహకారోద్యమం అభివృద్ధికి యెంత వరకూ యేర్పాటు చేయబడిందో సంక్షిప్తంగా సూచించండి.

జవాబు: ద్వితీయ ప్రణాళిక కాలంలో మొత్తం భారతదేశంలో 10,400 పెద్దరకం సహకార సంఘాలను, 1,800 మార్కెటింగు సొసైటీలను నెలకొల్పాలని వుద్దేశించబడినది. ప్రస్తుతపు సంఘాలు పునః పటిష్టం చేయబడి ఆపైన అదనంగా పై సంఘాలు నెలకొల్పబడతాయి. కేంద్ర, రాష్ట్రీయ సరుకులను నిలవచేసే సంస్థలు, మార్కెటింగు, పెద్దరకం సంఘాలద్వారా 350 సరుకుల నిల్వ కేంద్రాలను, 5,500 గిడ్డంగులను నెలకొల్పాలని కూడా నిర్ణయించబడింది. దీర్ఘకాలిక, మధ్యకాలిక, స్వల్పకాలిక ఋణాలుగా రైతులకు రూ. 225 కోట్ల వరకూ అప్పులు యివ్వబడతాయి. 35 పంచదార ఫాక్టరీలను, 118 సహకార 'కాటన్-గిన్'లను 118 యితర సహకార ప్రోసెసింగు సొసైటీలను నెలకొల్పాలని సంకల్పించబడింది.

ప్రశ్న 7. (శ్రీ అలవాల పుల్లారెడ్డి, కుందూరు వారి పాలెం, సత్తెనపల్లి తాలూకా, గుంటూరు జిల్లా).

ప్రభుత్వోద్యోగి తనకు కేటా యించిన విధిని నిర్వర్తించిన పిమ్మట తీరిక కాలంలో మరొక పనిని చేసుకోవచ్చా? ఇప్పుడు ప్రభుత్వం పొదుపుగా వాడుకొని డబ్బును నిలవ చేయమని ప్రజలను ప్రోద్బోధిస్తున్నదిగదా. ప్రభుత్వోద్యోగి డబ్బు నిలవ చేసుకొనుటకు బదులు స్థిరాస్థిని సంపాదించుకొనుటకు యేమైనా అడ్డువుందా ?

జవాబు: ప్రభుత్వోద్యోగుల నడవడిక నిబంధనావళి ప్రకారం, మామూలుగా ప్రభుత్వోద్యోగులు తమకు కేటాయించిన విధిని తప్ప డబ్బువచ్చే మరో పనులను చేయకూడదు; కాని కొన్ని షరతులకు లోబడివారు తమ తీరిక కాలంలో చేసే సాంస్కృతిక సంబంధమైన పనులు మున్నగువాటికి అనుమతింపబడిన ప్రతిఫలాన్ని స్వీకరించవచ్చు. నివాస గృహం వంటి స్థిరాస్థిని కూడా ప్రభుత్వోద్యోగులు సంపాదించవచ్చు. అయితే వారు అట్టి ఆస్తి వివరాలను ప్రభుత్వానికి నివేదించాలి.

ప్రశ్న 8. నాగార్జునసాగర్ ప్రాజెక్టు క్రింద విద్యుచ్ఛక్తి వుత్పత్తికి వుద్దేశించిన పథకాలు యేమిటి ?

జవాబు: నాగార్జునసాగర్ ఆనకట్టలో 3 లక్షల కె. వా. శక్తిగల 8 యూనిట్లను నెలకొల్పాలని సంకల్పించబడింది. కుడికాలవ 'ఆఫ్ టేక్'లో 60,000 కె. వా. శక్తిగల 2 యూనిట్లను నెలకొల్పాలని కూడా సంకల్పించబడింది.

—(:- o :-)—



ఈరంనూమాలో క్షయ, గుండెజబ్బుల సంస్థకు రాష్ట్ర ముఖ్య మంత్రి శంకుస్థాపన చేశారు.

# రాష్ట్రంలో వైద్యరక్షణ సౌకర్యాలు

(మేజర్ కె. ఎన్. రావు, వైద్యశాఖ డైరెక్టరు)

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం జనసంఖ్య 320 లక్షలు. దానిలో 20 జిల్లాలు, 293 పట్టణాలు, నగరాలు (ఆంధ్ర 171, తెలంగాణా 122), యించుమించు 26,450 గ్రామాలు (ఆంధ్ర 17,064, తెలంగాణా 9,386) వున్నాయి. ప్రస్తుతం వున్న వైద్య, ఆరోగ్య సౌకర్యాలు యిన్ని పట్టణాలు, నగరాలు, గ్రామాలలో నివసించే యింత జనాభాకు చాలవుఅని నేను వేరే చెప్పవలసిన అవసరంలేదు. పట్టణ ప్రాంతాలలో (17.4% జనాభా) కల ప్రభుత్వ ఆస్పత్రులు, ఔషధ శాలల సంఖ్య తెలంగాణా, ఆంధ్రలలో వరుసగా 44,139 అయివున్నది. అంటే మొత్తం ఆంధ్ర ప్రదేశ్‌లో వాటి సంఖ్య 183. పల్లెపట్టులలో (82.6% జనాభా) ప్రభుత్వ ఆస్పత్రులు, ఔషధశాలల మొత్తం సంఖ్య తెలంగాణాలో 194, ఆంధ్రలో 399 అయి వున్నది. పట్టణప్రాంతాలలోగల పడకలసంఖ్య తెలంగాణాలో 5,293, ఆంధ్రలో 8,448. వీటి మొత్తం 13,743. పల్లెపట్టులలోగల పడకల సంఖ్య తెలంగాణాలో 966, ఆంధ్రలో 1,421. వాటి మొత్తం 2,387.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మన రాష్ట్రానికి వైద్య, ఆరోగ్య కార్యక్రమం క్రింద రూ. 11.5 కోట్లు కేటాయించబడినవి. తెలంగాణాప్రాంతం అభివృద్ధికై దిగువ వసతి కల్పించబడింది.

| | | |
|---|---|---|
| వైద్య పథకాలు | ... 273.04 | లక్షలు |
| ప్రజారోగ్య పథకాలు | ... 54.12 | ,, |
| గ్రామీణ నీటి సరఫరా, మురుగు పారుదల | ... 39.39 | ,, |
| మొత్తం రూ. | 3.71 | కోట్లు |

ఆంధ్రప్రాంతం అభివృద్ధికై కల్పించబడిన వసతి వివరాలు యివి :

| | | |
|---|---|---|
| వైద్యపథకాలు | ... 360.84 | లక్షలు |
| ప్రజారోగ్యపథకాలు | ... 114.29 | ,, |
| జాతీయ గ్రామీణ నీటి సరఫరా పారిశుద్ధ్య కార్యక్రమం | ... 95.92 | ,, |
| పట్టణ నీటి సరఫరా, మురుగు పారుదల | ... 212.43 | ,, |
| మొత్తం రూ. | 7.83 | కోట్లు |

ఈ విధంగా మొత్తం ఆంధ్రప్రదేశ్‌లో వైద్య పథకాలకై మొత్తం రూ. 6.33 కోట్లు కేటాయించ బడినవి.

ప్రజలందరికీ యింకా యెక్కువగా అందుబాటు లోనికి వచ్చేవిధంగా ప్రస్తుతపు వైద్య సౌకర్యాలను విస్తరింపచేయటం వైద్య కార్యక్రమాల సాధారణ ఆశయమైవున్నది.

నిర్దిష్టమైన ఆశయాలు యివి :—

1. సంస్థా సౌకర్యాల యేర్పాటు. ఈ సంస్థలు కేంద్రంగా ప్రజలకు స్థానికంగా వైద్య సౌకర్యాలు అందజేయ బడుటేకాక వాటి చుట్టుపట్ల ప్రదేశాలకు కూడా అవి అందజేయ బడుతవి. అలా చేయడంలో గ్రామీణ ఆరోగ్య సేవకు ప్రత్యేక ప్రాధాన్యం యివ్వబడుతుంది;

2. తగిన శిక్షణా కార్యక్రమాలద్వారా సాంకేతిక సిబ్బంది వృద్ధి;

3. క్షయ, కుష్ఠువంటి అంటువ్యాధుల నివారణ;

4. కుటుంబని యంత్రణ.

ఆస్పత్రి సౌకర్యాలను కల్పించుటలో, సంఖ్య, స్థలం (డిస్ట్రిబ్యూషన్), యేకీకరణ, ప్రమాణము లున్నూ, (ఆస్పత్రుల) బలమైన ప్రాంతీయ విధాన మున్నూ దృష్టిలో వుంచుకొన బడినవి. ఈ విధానంలో విస్పష్టమైన నాలుగు అంశాలు అనగా బోధనా ఆస్పత్రి, జిల్లా ఆస్పత్రి, తాలూకా ఆస్పత్రి, ఆరోగ్య యూనిట్టులో చేరియున్న గ్రామీణ వైద్యకేంద్రాలు చేరి వుండగలవు. ధారాళ మైన వైద్యసేవా కార్యక్రమంతో పల్లెపట్టణ ప్రాంతాలకు సంతృప్తి కరమైన వైద్యరక్షణ కలిగించే సమన్వయ పూర్వకమైన ఆస్పత్రి విధానం కూడా దృష్టిలో వుంచుకొన బడింది. ఈ ఆశయాల దృష్ట్యా, ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలు రెండింటిలోను కూడా మొత్తం రూ. 6.33 కోట్ల వ్యయంపై అనేక పథకాలను తలపెట్టినది ఆంధ్రప్రదేశ్ వైద్య ప్రణాళిక. ఈ పథకాల అమలుకై కేంద్రప్రభుత్వం నుంచి గ్రాంట్ల రూపంలో రూ. 133.69 లక్షలు లభించగలవని భావించబడు తున్నది.

పడకల సంఖ్యను వెయ్యికి పెచ్చించుట, పల్లె పట్టణ ఆస్పత్రుల సంఖ్యను మరొక 120 పెంచుట తెలంగాణా లక్ష్యాలలో చేరివున్నాయి.

ఆంధ్ర ప్రాంతంలో, 1,900 పడకలను పెచ్చించాలనీ, పల్లె, పట్టణ కేంద్రాలలో మరొక 108 ఆస్పత్రులు, ఔషధశాలలను నెలకొల్పాలని తలపెట్ట బడినది. 400 మంది డాక్టర్లు, 69 మంది టెక్నీషియనులు, 495 మంది నర్సులు, 48 మంది ఫార్మసిస్టులు, 200 మంది సహాయ ఆరోగ్య కార్యకర్తలు, 24 మంది లేబొరేటరీ సహాయకుల శిక్షణను పూర్తి చేయాలని కూడ ప్రణాళికలో తలపెట్ట బడింది.

## విశేషాంశాలు

తెలంగాణా ప్రాంతం పథకాలలో దిగువ పేర్కొన్న పథకాలు వున్నాయి. ఉస్మానియా, గాంధీ వైద్య కళాశాలల నిమిత్తం కొత్త కళాశాలా భవ

శాల నిర్మాణం, వుఉస్మానియా జనరల్ ఆస్పత్రి, కింగ్ యెడ్వర్డు మెమోరియల్ ఆస్పత్రులను, వాటిలో చేరివున్న బోధనా ఆస్పత్రులను అనగా నిలోఫర్, ప్రసూతి, కేన్సర్, క్షయ, పిచ్చాసుపత్రులను విస్తరింపచేయటం; అన్ని జిల్లా ఆస్పత్రుల విస్తరణ : ఇందులో భవనాల విస్తరణ, పడకల హెచ్చింపు, క్షయ, సుఖవ్యాధులు, కుటుంబ నియంత్రణ, దంత, చెవి, ముక్కు, గొంతుక, కన్ను, కుష్ఠువంటి ప్రత్యేక వ్యాధుల చికిత్సా సౌకర్యాల కల్పన కూడా చేరి వుంటాయి. మహబూబునగరం, ఖమ్మములలో కొత్త ఆస్పత్రులకి వసతికల్పన; తాలూకా ఆస్పత్రుల భవనాలను విస్తరింపజేసి, పడకల సంఖ్యను హెచ్చించుట; ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు, సబ్సిడైజుడు గ్రామీణ ఔషధశాలల యేర్పాటుద్వారా గ్రామీణ ఆస్పత్రుల సేవా కార్యక్రమాన్ని హెచ్చించుట.

ఆంధ్ర ప్రణాళికలో కల పథకాల వివరాలు యివి : ఆంధ్ర వైద్య కళాశాల, కింగ్ జార్జి ఆస్పత్రుల భవనాలు, గుంటూరు వైద్య కళాశాల, గుంటూరు జనరల్ ఆస్పత్రుల భవనాలు, కర్నూలు వైద్య కళాశాల, కర్నూలు జనరల్ ఆస్పత్రుల భవనాలను భారతీయ వైద్యసంఘం చెప్పినట్టు విస్తరింపచేయటం, ఏలూరు, అనంతపురాలలోని కొత్త ఆస్పత్రులను పూర్తిచేయటం; మచిలీపట్నం, నెల్లూరు, చిత్తూరు, కడపలలోని జిల్లా ఆస్పత్రుల విస్తరణ; శ్రీకాకుళం, నెల్లూరులలో క్షయచికిత్స, దంతవైద్యం, కుటుంబ నియంత్రణ, సుఖవ్యాధులు, చెవి, ముక్కు, గొంతుక, కన్ను, కుష్ఠువ్యాధుల చికిత్సలకు ప్రత్యేక క్లినిక్‌లను యేర్పాటు చేయటంతోపాటు కొత్త ఆస్పత్రులకు వసతి కల్పించుట; ప్రాంతీయ, జిల్లా లేబొరేటరీ సర్వీసులను నెలకొల్పుట, తాలూకా ఆస్పత్రుల విస్తరణ: ఈ కార్యక్రమంక్రింద విజయవాడ, రాజమండ్రి, తిరుపతి, నూజివీడులలో పడకలసంఖ్య హెచ్చించబడుతుంది, విశాఖపట్నం, మంగళగిరి, కర్నూలలో క్షయ ఆసుపత్రులు స్థాపించబడతాయి, విశాఖపట్నం, గుంటూరు, తిరుపతి, భద్రాచలాలలో అంటురోగాల ఆస్పత్రులు నెలకొల్పబడతాయి.

## సామాన్య పథకాలు

దిగువ పథకాలు సామాన్య పథకాలు. అందుచేత ఆంధ్రప్రాంతపు ప్రణాళికా కేటాయింపు తెలంగాణాకు బదిలీ చేయబడింది. ఆయా సంస్థలు హైదరాబాదు మున్నగు ప్రదేశాలలో నెలకొల్పబడతాయి:

1. చెన్నపురిలో కింగ్ ఇనిస్టిట్యూట్ వంటి సంస్థ (నిరోధవైద్యం, సెంట్రల్ లేబొరేటరీ ఇనిస్టిట్యూటు).
2. రసాయన పరీక్షకుని శాఖ.
3, పేడియాట్రిక్ సెంటర్.
4. క్షయ ప్రదర్శన, శిక్షణాకేంద్రం మరియు పునరావాసం, అనంతరరక్షణ.
5. అభివృద్ధి చేయబడిన వైద్య చరిత్ర శాఖ.
6. ఆయుర్వేదంలో పరిశోధన.
7. దంత వైద్య కళాశాల.
8. రిఫ్రాక్షనిస్టుల శిక్షణ.
9. సాంఘిక కార్యకర్తల శిక్షణ.
10. వరంగల్లులో నర్సింగు స్కూలు.
11. టి. సి. ఎమ్. సహాయంతో హైదరాబాదులో నర్సింగు కాలేజీ.
12. కేంద్ర మలేరియా లేబొరేటరీ మున్నగు ప్రజారోగ్య పథకాలు.

## ద్వితీయ ప్రణాళికలో

పూర్తి అయిన లేక అమలుజరుగుతున్న ముఖ్యమైన పథకాలలో కొన్నిటిని గురించి చెబుతాను:

## వైద్య కళాశాలలు

హైదరాబాదు కళాశాలల్లో యేటా 150 మంది చేర్చుకోబడతారు. ఆంధ్ర వైద్య కళాశాలలో ప్రవేశాల సంఖ్య 85 నుంచి 125 కి హెచ్చింది. ఈ ప్రణాళికకాలంలో గుంటూరు వైద్య కళాశాలలో సాలుసరి ప్రవేశాల సంఖ్య 55 నుంచి 125 కి హెచ్చింది. కర్నూలు కొత్త వైద్య కళాశాలలో 50 మంది చేర్చుకోబడ్డారు.

విశాఖపట్నం కింగ్‌జార్జి ఆస్పత్రిలో పడకల సంఖ్య 1000 కి, గుంటూరు ప్రభుత్వ జనరల్ ఆస్పత్రిలో పడకల సంఖ్య 600 కి, కర్నూలు ప్రభుత్వ జనరల్ ఆస్పత్రిలో పడకల సంఖ్య 350 కి హెచ్చించబడింది. ఆంధ్రి వైద్య కళాశాల, కింగ్‌జార్జి ఆస్పత్రి, గుంటూరు వైద్య కళాశాల గుంటూరు ప్రభుత్వ జనరల్ ఆస్పత్రుల భవన నిర్మాణ కార్యక్రమం కొనసాగుతున్నది. గుంటూరులో పు గ విద్యార్థుల వసతి గృహం పూర్తి అయింది. రోగ లక్షణ శాస్త్ర బ్లాక్‌పై రెండవ అంతస్తు సిద్ధం అయింది. కర్నూలు వైద్య కళాశాల రెండవ దశ అభివృద్ధి పూర్తి అయింది.

ఉస్మానియా జనరల్ ఆస్పత్రి పూర్తిగా పునర్వ్యవస్థీకరింపబడింది. రొమ్ముశస్త్ర చికిత్స, నాడీ శస్త్ర చికిత్స, చర్మ చికిత్స, సుఖవ్యాధుల చికిత్స, నరాలవ్యాధి చికిత్స, గుండెజబ్బుల చికిత్సా శాఖల వంటి ప్రత్యేక శాఖలు యేర్పాటుచేయబడినవి. రోగలక్షణ శాస్త్ర వస్తు ప్రదర్శనశాల, మార్చ్యురీవంటశాల మున్నగువాటి పనిచేపట్టబడింది.

కింగ్ యెడ్వర్డు మెమోరియల్ ఆస్పత్రి బోధనా సంస్థగా మార్చబడింది. దానిలో పడకల సంఖ్య 310 నుంచి 410 కి హెచ్చించబడింది. ప్రమాణాలను హెచ్చించుటకువలసిన యితర చర్యలు తీసుకొనబడుతున్నాయి.

పిల్లల ఆస్పత్రి (నిలోఫర్ ఆస్పత్రి), ప్రభుత్వ ప్రసూతి ఆస్పత్రి, క్షయ ఆస్పత్రి, సరోజినీ దేవి ఆస్పత్రి (కన్ను, చెవి, ముక్కు, గొంతు) వంటి ప్రత్యేక విషయక ఆస్పత్రులు బోధనా సంస్థలుగా మార్చబడినవి. అందు నిమిత్తం వాటిలో వరుసగా పేడియాట్రిక్, శిశు ఆరోగ్య సంస్థలు, ప్రసూతి, స్తన శాస్త్ర సంస్థ, నేత్ర చికిత్సా సంస్థ నెలకొల్పబడినవి. అదనపు భవనాలు, పరికరాలు, సిబ్బంది మంజూరు చేయబడినవి.

## శాఖల అభివృద్ధి

విశాఖపట్నంలోని ఆంధ్రి వైద్య కళాశాలలోని రోగలక్షణ శాస్త్ర శాఖ, ఉస్మానియా వైద్య కళాశాలలోని వైద్య చరిత్ర శాఖలు అభివృద్ధిచేయబడినవి. జంతుదేహధర్మ శాస్త్రము, శారీర శాస్త్రము, ఔషధ శాస్త్రము వంటి శాఖల అభివృద్ధి విషయం పరిశీలించబడుతున్నది.

## బోధనా యూనిట్లు

వైద్య కళాశాలల్లో బోధన, పరిశోధనలను అభివృద్ధి పరచుటకై వైద్యం, శస్త్ర చికిత్స, ప్రసూతి శాస్త్రం, స్తనశాస్త్రం, రోగలక్షణ శాస్త్రం, శారీర శాస్త్రం మున్నగు వాటిలో పూర్తికాలం పనిచేసే బోధనా యూనిట్లు స్థాపించబడాలనే ప్రతిపాదనను ప్రభుత్వం ఆమోదించింది. ఈ పథకాన్ని కేంద్ర ప్రభుత్వం, అదనపు ఖర్చుకి ధనసహాయం చేయుటకై, ఆమోదించినట్టు తెలుస్తున్నది. ఈ పథకం 1959-60 నుంచి ఆరంభమవుతుంది.

## పోస్టుగ్రాడ్యుయేటు విద్య

హైదరాబాదు, విశాఖపట్నాలలో చెరి ఒకటి చొప్పున రెండు పోస్టుగ్రాడ్యుయేటు వైద్యసంస్థల స్థాపనను ప్రోత్సహించుట ద్వారా 5 కళాశాలల విద్యార్థుల పోస్టుగ్రాడ్యుయేటు సౌకర్యాల విషయంలో తగినశ్రద్ధ గైకొనడం జరిగింది. మన రాష్ట్రంలో బోధనా పదవుల ఆక్రమణ విషయంలో స్వయం సమృద్ధిని సాధించుటకై పోస్టుగ్రాడ్యుయేట్ల విద్యకై క్రమబద్ధమైన తరగతులను యేర్పాటు చేయుటకు పోస్టుగ్రాడ్యుయేటు వైద్య విద్య, పరిశోధనలకు రెండు సంఘాల స్థాపనను గురించి ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

## పేడియాట్రిక్ సెంటరు

కేంద్రప్రభుత్వ పథకంక్రింద క్రితం సంవత్సరం పేడియాట్రిక్ సెంటరు నెలకొల్ప బడింది. దానికి భారతదేశ వుపాధ్యక్షులు ప్రారంభోత్సవం చేశారు. ఈ కేంద్రం అండర్ గ్రాడ్యుయేట్లకు, పోస్టుగ్రాడ్యుయేట్లకి వుద్దేశించ బడింది.

## తిరుపతి క్రొత్త ఆస్పత్రి

కాలక్రమేణా బోధనా, శిక్షణా కేంద్రంగా వుపకరించగల తిరుపతి రూయా ఆస్పత్రి నిర్మాణాన్ని

ప్రభుత్వం ఆమోదించింది. నిర్మాణం త్వరలోనే ప్రారంభం కావచ్చు.

వరంగల్లులోని మహాత్మాగాంధీ మెమోరియల్ ఆస్పత్రి విస్తరణ కార్యక్రమం కూడా చేపట్టబడింది. ఇది మొదట ఇంటర్నీల శిక్షణా కేంద్రంగా వుంటుంది. ఆ తరువాత వైద్య విద్యార్థుల బోధన, శిక్షణా సంస్థగా అభివృద్ధి పరచబడుతుంది.

## ఇతర శిక్షణా కార్యక్రమాలు

వివిధ తరగతులలోను శిక్షితులైన సాంకేతిక సిబ్బంది సంఖ్యను పెంచుటకై వివిధ శిక్షణా కార్యక్రమాలు ప్రారంభింప బడ్డాయి. సంక్షిప్తంగా అవి యివి :—

1. విశాఖపట్నంలోని ఆంధ్ర వైద్యకళాశాలలో యేటా 15 మంది సహాయ శస్త్రచికిత్సకులకు శస్త్రచికిత్స, ప్రసూతి శాస్త్రం, వైద్యం మున్నగు వాటిలో స్వల్పకాలిక శిక్షణ యివ్వబడు తున్నది.

2. ఆంధ్ర, ఉస్మానియా వైద్య కళాశాలలు, హైదరాబాదులోని సెంట్రల్ లేబొరేటరీలలో ఒక్కొక్క సంస్థలో యేటా 12 మందికి చొప్పున టెక్నీషియన్లకు శిక్షణ యివ్వబడు తున్నది.

3. వివిధ ఆస్పత్రులలో యేటా 130 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వబడు తున్నది.

4. వివిధ శిక్షణా కేంద్రాలలో యేటా 150 మంది అదనపు మంత్రసానులు చేర్చుకోబడు తున్నారు.

5. వివిధ శిక్షణా కేంద్రాలలో ప్రతియేటా 52 మంది అదనపు నర్సులు చేర్చుకోబడు తున్నారు.

6. వివిధ శిక్షణా కేంద్రాలలో శిక్షణకై యేటా 180 మంది సహాయ నర్సు మంత్రసానులు చేర్చుకోబడుతున్నారు.

7. నేత్ర చికిత్సా సంస్థ, సరోజినీదేవి ఆస్పత్రిలో శిక్షణకై యేటా 12 మంది రిఫ్రాక్షనిస్టులు, ఆప్టీషియన్లు చేర్చుకోబడుతున్నారు.

8. ఆంధ్ర వైద్య కళాశాలలో శిక్షణకై ప్రతియేటా 40 మంది సహాయ ఆరోగ్య కార్యకర్తలు చేర్చుకోబడుతున్నారు.

9. ఏటా శిక్షణకై ఆంధ్ర వైద్య కళాశాలలో 100 మంది, గుంటూరు వైద్య కళాశాలలో 100 మంది విద్యార్థి శానిటరీ ఇనస్పెక్టర్లు చేర్చుకోబడుతున్నారు. కర్నూలు వైద్య కళాశాలలో శానిటరీ ఇనస్పెక్టర్ల శిక్షణను ఆరంభించే విషయం చేపట్టబడుతున్నది.

10. ఆంధ్ర వైద్య కళాశాలలో లేబొరేటరీ అసిస్టెంట్ల శిక్షణకై యేటా ఆరుగురు అభ్యర్థులు చేర్చుకోబడుతున్నారు.

11. కింగ్ జార్జి ఆస్పత్రిలో ప్రజారోగ్య నర్సులుగా శిక్షణ పొందుటకై యేటా 12 మంది అభ్యర్థులు చేర్చుకోబడుతున్నారు.

12. ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలో వైద్య-సాంఘిక కార్యకర్తలుగా శిక్షణ పొందుటకై యేటా 12 మంది అభ్యర్థులు చేర్చుకోబడుతున్నారు.

## జిల్లా ఆస్పత్రులు

### పశ్చిమ గోదావరి

ఏలూరులో రూ. 35 లక్షల వ్యయంపై జిల్లా ముఖ్యపట్నం కొత్త ఆస్పత్రి నిర్మాణం పూర్తి చేయబడింది.

### అనంతపురం

అనంతపురంలో రూ. 19 లక్షల ఖర్చుపై జిల్లా ముఖ్యపట్నం కొత్త ఆస్పత్రి నిర్మాణం చేపట్టబడింది.

దిగువ జిల్లా ఆస్పత్రులలో పడకల సంఖ్య పెంచబడుతున్నది :

| | | | | |
|---|---|---|---|---|
| నెల్లూరు | 120 | నుంచి | 200 | కి |
| చిత్తూరు | 129 | ,, | 150 | ,, |
| ఆదిలాబాదు | 12 | ,, | 40 | ,, |
| నిజామాబాదు | 82 | ,, | 120 | ,, |
| ఖమ్మం | 37 | ,, | 60 | ,, |
| నల్గొండ | 45 | ,, | 80 | ,, |
| మహబూబునగరం | 29 | ,, | 60 | ,, |

## కరీంనగరం

ఆస్పత్రి కొత్త భవనాలను 3-1-1958 న రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభించారు. అదనపు వసతి లభించుటతో పడకల సంఖ్య 48 నుంచి 108 కి హెచ్చించబడింది. అదనపు సిబ్బంది, పరికరాలు సమకూర్చబడినవి. కరీంనగరంలో రూ. 1.50 లక్షల వ్యయంపై 2-1/2 యెకరాల ప్రైవేటు భూమి సంపాదనను కూడా ప్రభుత్వం మంజూరు చేసింది. కరీంనగరంలో రూ. 1.01 లక్షలతో సిబ్బంది గృహాల నిర్మాణాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది.

## మహబూబునగరం

మహబూబునగరంలో రూ. 0.54 లక్షలతో అదనపు వార్డులను నిర్మించుటకు ప్రభుత్వం ఆమోదించింది.

## సంగారెడ్డి

రూ. 20,540 ఖర్చుపై ఒక క్షయవార్డు మంజూరు చేయబడింది

## నిజామాబాదు

నిజామాబాదు జిల్లా ఆస్పత్రి విస్తరించబడింది.

## ఆదిలాబాదు

ఆదిలాబాదులో కొత్త ఆస్పత్రి భవనాలు స్వాధీనం చేసుకోబడినవి. పడకల సంఖ్య హెచ్చించబడింది.

## వరంగల్లు

ఇద్దరు అదనపు సివిల్ సర్జన్‌లు (ఒక సర్జను, అబ్‌స్టెట్రిషియను) నియమించబడ్డారు. 16 పడకలు వుండగల క్షయవార్డు నిర్మించబడుతున్నది. 100 మంది రోగులకు వసతి సౌకర్యం కలిగించే నిమిత్తం వార్డులను నిర్మించాలని సంకల్పించబడింది. ఈ సంవత్సరం ప్రాంతీయ లేబొరేటరీ కూడా ప్రారంభింపబడింది.

## తాలూకా ఆస్పత్రులు

1957-58, 1958-59 లలో దిగువ తాలూకా ముఖ్యపట్నాల ఆస్పత్రులలో పడకల సంఖ్య హెచ్చించబడినది.

| | |
|---|---|
| మహబూబాబాదు ప్రభుత్వ ఆస్పత్రి, వరంగల్లు జిల్లా | 24 నుంచి 40 కి |
| ఖానాపురం ప్రభుత్వ ఆస్పత్రి, ఆదిలాబాదు జిల్లా | 5 నుంచి 15 కి |
| సూర్యాపేట ప్రభుత్వ ఆస్పత్రి, నల్గొండ జిల్లా | 20 నుంచి 30 కి |
| భోనగిరి ప్రభుత్వ ఆస్పత్రి, నల్గొండ జిల్లా | 18 నుంచి 26 కి |
| కల్వకుర్తి ప్రభుత్వ ఆస్పత్రి, మహబూబునగరం జిల్లా | 5 నుంచి 20 కి |
| కొల్లాపూర్ ప్రభుత్వ ఆస్పత్రి, నల్గొండ జిల్లా | 4 నుంచి 15 కి |
| మిర్యాలగూడ ప్రభుత్వ ఆస్పత్రి, నల్గొండ జిల్లా | 7 నుంచి 15 కి |
| నరసంపేట ప్రభుత్వ ఆస్పత్రి, వరంగల్లు జిల్లా | 3 నుంచి 20 కి |
| జనగాం ప్రభుత్వ ఆస్పత్రి, వరంగల్లు జిల్లా | 16 నుంచి 30 కి |
| నారాయణపేట ప్రభుత్వ ఆస్పత్రి, మహబూబునగరం జిల్లా | 10 నుంచి 20 కి |
| కామారెడ్డి ప్రభుత్వ ఆస్పత్రి, నిజామాబాదు జిల్లా | 4 నుంచి 12 కి |
| బన్సవాడ ప్రభుత్వ ఆస్పత్రి, నిజామాబాదు జిల్లా | 22 నుంచి 40 కి |
| బోధన్ ప్రభుత్వ ఆస్పత్రి, నిజామాబాదు జిల్లా | 23 నుంచి 40 కి |

రూ. 55,950 ఖర్చుపై జగిత్యాల ప్రభుత్వ ఆస్పత్రికి, రూ. 26,000 ఖర్చుపై జడ్‌చెర్ల ప్రభుత్వ ఆస్పత్రికి, రూ. 20,000 ఖర్చుపై సిద్దిపేట ప్రభుత్వ

ఆస్పత్రికి కొన్ని అభివృద్ధి పనులను కూడా ప్రభుత్వం మంజూరు చేసింది.

అలాగే కందుకూరు, కనిగిరి (నెల్లూరు జిల్లా) ప్రభుత్వ ఆస్పత్రులలో పడకల సంఖ్య కూడా హెచ్చించబడింది. తెనాలి ప్రభుత్వ ఆస్పత్రి పడకల సంఖ్య 52 నుంచి 80 కి, గురజాల ప్రభుత్వ ఆస్పత్రి పడకల సంఖ్య 4 నుంచి 16 కి, నంద్యాల ప్రభుత్వ ఆస్పత్రి పడకల సంఖ్య 40 నుంచి 50 కి హెచ్చించబడింది. ఈ ఆస్పత్రులన్నిటిలోను అదనపు సిబ్బంది, పరికరాలు సమకూర్చబడినవి.

## స్థానికనిధి వైద్య సంస్థల జాతీయకరణ

ద్వితీయ ప్రణాళిక తొలి రెండు సంవత్సరాలలోను దిగువ స్థానికనిధి వైద్య సంస్థలు 15 జాతీయం చేయబడినవి :— ధర్మవరం, పుత్తూరు, తాడేపల్లి గూడెం, వెంకటగిరి, అవనిగడ్డ, కొత్తపేట, కపిలేశ్వరపురం, సింహాచలం, మాచెర్ల, సత్తెనపల్లి, సూళ్లూరుపేట, యెమ్మిగనూరు, శృంగవరపుకోట, నిడదవోలు, వినుకొండ.

## సబ్సిడైజుడు డిస్పెన్సరీలు

ఈ రెండు సంవత్సరాలలోను ప్రభుత్వం ఆంధ్ర ప్రాంతంలో 50, తెలంగాణా ప్రాంతంలో 103 గ్రామీణ ఔషధశాలలను మంజూరుచేసింది.

మార్చిన సమాజాభివృద్ధి కార్యక్రమంలో జాతీయ విస్తరణ సేవకు, సమాజాభివృద్ధి కేంద్రాలకు వ్యత్యాసం తొలగించబడటంతో, ప్రభుత్వశాఖ యీ సంవత్సరం, అనంతర తీవ్ర అభివృద్ధి కేంద్రాలలోను, ప్రి ఎక్స్టెన్షన్ సర్వీసు కేంద్రాలలోను 29 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ప్రారంభిస్తుంది.

108 స్టేట్ 1 బ్లాకులలో అంచెలవారీగా ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను నెలకొల్పవలసి వున్నది.

## క్షయ నివారణ కార్యక్రమం

దిగువ 18 జిల్లా ముఖ్యపట్నాల ఆస్పత్రులలోను అభివృద్ధి చేయబడిన క్షయ చికిత్సా క్లినిక్‌లు యేర్పాటు చేయబడినవి. వాటిలో ఎక్స్‌రే సౌకర్యాలు, లేబొరేటరీ పరికరాలు వున్నాయి :

నిజామాబాదు, దబీర్‌పూరా, నెల్లూరు, చిత్తూరు, కడప, కరీంనగరం, వరంగల్లు, మహబూబునగరం, గుంటూరు, కాకినాడ, కర్నూలు, ఏలూరు, మచిలీపట్నం, అనంతపురం, విశాఖపట్నం, ఖమ్మం, మెదక్, నల్గొండ.

క్షయకు విడి పడకల విషయంలో, 1956-57 లో 150, 1957-58 లో 240, 1958-59 లో 320 పడకల యేర్పాటును ప్రభుత్వం మంజూరు చేసింది. ఈరమ్‌నూమా క్షయ ఆస్పత్రి పడకల సంఖ్య 500 నుంచి 600 కి, వికారాబాదు క్షయ ఆరోగ్యసదనం పడకల సంఖ్య 200 నుంచి 300 కి హెచ్చించబడింది. రఫత్‌బాగ్ 30 మంది రోగుల పునరావాస కేంద్రంగా మార్చబడింది. నెల్లూరు క్షయ ఆస్పత్రి అభివృద్ధి చేయబడింది. దానికి 150 పడకలు మంజూరైనవి. మరొక 100 పడకలు కూడా మంజూరు చేయబడినవి. క్షయ నివారణ ప్రదర్శన, శిక్షణ కేంద్రం స్థాపనను కూడా ప్రభుత్వం మంజూరు చేసింది. దానికి మన ముఖ్యమంత్రి 15-5-58 న ప్రారంభోత్సవం చేశారు. ఈ సంస్థ భవనాల నిర్మాణం రూ 4 లక్షల ఖర్చుపై చేపట్టబడింది. దానికి గౌరవ ముఖ్యమంత్రి యీవేళ శంకుస్థాపన చేస్తారు. క్షయ నివారణ ఆధునిక పద్ధతులలో క్షయ నివారణ కార్యకర్తలకు శిక్షణ యివ్వబడుతుంది, యీ సంస్థలో, రాష్ట్రంలో విస్తృతమైన కార్యక్రమ నిర్వహణకు వారు వుపకరిస్తారు. ఈ కేంద్రం ప్రపంచ ఆరోగ్య సంస్థ యాజమానాన్య నెలకొల్పబడుతున్నది. ఇందు నిమిత్తం ఆ సంస్థ 2 సంవత్సరాలపాటు నలుగురు అంతర్జాతీయ నిపుణుల సహాయాన్ని అందిస్తుంది. ఈ జట్టు నాయకుడు డా. లోవెన్. ఈ అంతర్జాతీయ సిబ్బంది తోడ్పాటుతో యీ క్షయ చికిత్సాకేంద్రం అద్భుతంగా పురోగమిస్తున్నది. 200 పడకలుగల మంగళగిరి క్షయ ఆస్పత్రి యీ నెలలో తీసుకొనబడుటకు దాదాపు సిద్ధం అయింది.

75 పడకలతో విశాఖపట్నానికి క్షయ ఆస్పత్రి మంజూరు చేయబడింది. మన ముఖ్యమంత్రి దానికి

శంకుస్థాపన చేశారు. కర్నూలులో 100 పడకల క్షయ ఆస్పత్రి వింగ్‌పని యీ నెలలో చేపట్టబడుతున్నది. రాష్ట్ర ప్రభుత్వం 4 సమాజాభివృద్ధి కేంద్రాలలో కూడా క్షయ నివారణ కార్యక్రమాన్ని ప్రయోగాత్మకంగా యేర్పాటుచేసి ఒక్కొక్క కేంద్రానికి మళ్లీమళ్లీ అయ్యే ఖర్చుకి రూ. 3000 లను, ఒక్కసారే అయ్యే ఖర్చుకి రూ. 1000 లను మంజూరు చేసింది. సమాజాభివృద్ధి కేంద్రాలలో యిట్టి నివారణ చర్యలను ఓంప్రథమంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమే ప్రవేశపెట్టింది.

## రొమ్ముశస్త్ర చికిత్సా కేంద్రాలు

విశాఖపట్నం కింగ్‌జార్జి ఆస్పత్రి, ఉస్మానియా జనరల్ ఆస్పత్రి, ఈరంనూమా క్షయ ఆసుపత్రులలో శ్వాసకోశ సంబంధమైన క్షయ వ్యాధి చికిత్సకై రొమ్ముసంబంధమైన శస్త్రచికిత్సా కేంద్రాలను ప్రభుత్వం యిదివరకే నెలకొల్పింది. గుంటూరు, కర్నూలులలో అట్టి రొమ్ము శస్త్రచికిత్సాశాఖల స్థాపనకు వుద్దేశించిన పథకాన్ని ప్రభుత్వం మంజూరు చేసింది.

## కుష్ఠ నివారణ

ద్వితీయ ప్రణాళికలో యింతవరకూ దిగువ ప్రదేశాలలో 6 కుష్ఠు వ్యాధి కేంద్రాలు నెలకొల్పబడినవి: కృష్ణాజిల్లా కేసరిపల్లి, కర్నూలు, మహబూబునగరం జిల్లా కొడంగల్లు, కడప, పశ్చిమగోదావరి, నిజామాబాదు. కారంపల్లి, తిరుపతిలలో గల కుష్ఠు ఆస్పత్రులు ప్రభుత్వ స్వాధీనం చేసుకోబడినవి.

## సుఖవ్యాధుల నివారణ

నెల్లూరు జిల్లా ముఖ్యపట్నం ఆస్పత్రి, కర్నూలు జనరల్ ఆస్పత్రి, విశాఖపట్నం కింగ్‌జార్జి ఆస్పత్రి, వుస్మానియా జనరల్ ఆస్పత్రులలోను, గుంటూరు, ఏలూరు, కడప, వరంగల్లు, కరీంనగరాలలోను సుఖవ్యాధుల క్లినిక్‌లు యేర్పాటు చేయబడినవి. ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలో క్లినిక్‌కి లేబొరేటరీ కూడా యేర్పాటు చేయబడింది.

## కుటుంబ నియంత్రణ

ఏలూరు, మచిలీపట్నం, చిత్తూరు, అనంతపురం జిల్లా ఆస్పత్రులలోను, నిలోఫర్ ఆస్పత్రిలోను, నిజామాబాదు, ఖమ్మం జిల్లా ఆస్పత్రులలోను, ఉస్మానియా, గాంధీ వైద్య కళాశాలలు, విశాఖపట్నం ఆంధ్ర వైద్య కళాశాల, కర్నూలులోని కర్నూలు వైద్య కళాశాలల్లో కుటుంబ నియంత్రణ క్లినిక్కులు నెలకొల్పబడినవి.

## ప్రత్యేకాహార వంట శాలలు

విశాఖపట్నం కింగ్‌జార్జి ఆస్పత్రి, గుంటూరు ప్రభుత్వ జనరల్ ఆస్పత్రి, హైదరాబాదు వుస్మానియా జనరల్ ఆస్పత్రులలో ప్రత్యేకాహార వంట శాలలు యేర్పాటు చేయబడినవి.

## పుట్టకురుపు ఆస్పత్రి

పుట్టకురుపు (కేన్సర్) ఆస్పత్రి పడకల సంఖ్య 40 నుంచి 105 కి హెచ్చించ బడింది. నవీన పద్ధతిలో పుట్టకురుపు చికిత్సకై భారతీయ సాంఘిక సేవా మహాసభ, కేంద్ర ప్రభుత్వాల సహాయంతో కోబాల్టు 60 యూనిట్టును స్థాపించాలని సంకల్పించబడింది.

## నిరోధవైద్యం, సెంట్రల్ లేబొరేటరీ, లేబొరేటరీ సర్వీసులు

రూ. 1.78 లక్షల ఖర్చుపై అదనపు భవనాల నిర్మాణం చేపట్టబడింది. పని హెచ్చినందున ప్రభుత్వం అదనపు సిబ్బందిని, పరికరాలనుకూడా మంజూరు చేసింది. విశాఖపట్నం, కర్నూలు, వరంగల్లు, గుంటూరులలో ప్రాంతీయ లేబొరేటరీలు నెలకొల్పబడినవి. నిజామాబాదు, కాకినాడ, మహబూబు నగరాలకి జిల్లా లేబొరేటరీలు మంజూరు చేయబడినవి.

## దంతవైద్య క్లినిక్కులు

కాకినాడ, చిత్తూరు జిల్లా ముఖ్యపట్టణాల ఆస్పత్రులలోను, నిజామాబాదు, కరీంనగరం, వరంగల్లు,

మహబూబునగరం, అనంతపురం, నెల్లూరు, కర్నూలులలోను 9 దంతవైద్య క్లినిక్కులు యేర్పాటు చేయబడినవి.

## దంత వైద్య విభాగం

హైదరాబాదులోని ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలో దంతవైద్య విభాగం యేర్పాటును ప్రభుత్వం మంజూరు చేసింది. ఇక్కడ విద్యార్థులకు బి.డి.ఎస్. కోర్సు చెప్పబడుతుంది. ఆ కోర్సు కాలం 4 సంవత్సరాలు. దంత శస్త్రచికిత్సాచార్యుడు నియమింపబడ్డాడు. ఉస్మానియా జనరల్ ఆస్పత్రి ఔట్ పేషెంటు బ్లాకులో దంతవైద్య కళాశాలకు వసతి యేర్పాటు చేయబడింది. ఈ సంవత్సరం బి. డి. ఎస్. కి ముందు నడిచే ప్రి-ప్రొఫెషనల్ తరగతులలో 25 మంది విద్యార్థులు చేర్చుకోబడుతున్నారు. బి. డి. ఎస్. కోర్సులు 1959 జూలై నుంచి ఆరంభమవుతాయి. దంత శస్త్రచికిత్స బోధనకై ఒక ఆచార్యుడు, యిద్దరు లెక్చరర్లు కూడా నియమింపబడ్డారు. మళ్లీ మళ్లీ అయే ఖర్చులో సగాన్ని ఒక్కసారే అయే ఖర్చులో నాలుగింట మూడు వంతులను యివ్వడం ద్వారా కేంద్రప్రభుత్వం యీ ప్రాజెక్టుకి తోడ్పడుతుంది.

## వైద్య పరిశోధన

వైద్య కళాశాలల్లో పరిశోధనకి పథకాలను ఆమోదించుటకై ప్రభుత్వం ఒక కమిటీని మంజూరు చేసింది. ఏటా ఖర్చులకై రూ. 10,000 సమకూర్చబడినవి. ఇవి పూర్తిగా వినియోగించుకోబడుతున్నది.

## వైద్యశాస్త్ర అకాడమీ

ఆంధ్రప్రదేశ్ కి వైద్యశాస్త్రాల అకాడమీ మన ముఖ్యమంత్రి పోషకత్వాన 1957-58 లో నెలకొల్పబడింది. 2 పరిశోధన బహుమతులను, లెక్చర్ షిప్పును యేర్పరచుటకై కేంద్ర ఆరోగ్య మంత్రిత్వశాఖ రూ. 10,000 విరాళం యిచ్చింది. పుట్టకురుపు పరిశోధనలో ఫెలోషిప్పులకై భారతీయ సాంఘిక సేవా మహాసభ రూ. 5,000 విరాళం యిచ్చింది. లాడెర్లీ కంపెనీ స్వర్గీయ యల్లాప్రగడ సుబ్బారావు మెమోరియల్ లెక్చరర్ షిప్పులను ప్రవేశపెట్టి, సాలీనా రూ. 600 యిస్తానన్నది. ఆంధ్రప్రదేశ్ క్షయ అసోసియేషన్ ఎండౌమెంటు లెక్చర్ కై యేటా రూ. 300 యిస్తున్నది. పరిశోధనను, శాస్త్రీయమైన ఆలోచనను ప్రోత్సహించుటకై ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని వైద్య కళాశాలలన్నిటిలోను యీ అకాడమీ శాఖలు నెలకొల్పబడినవి. ఈ అకాడమీకి రూ. 5,000 నాన్-రికరింగు గ్రాంటును యిచ్చినందుకు ప్రభుత్వానికి నా కృతజ్ఞత. ఇది రికరింగు గ్రాంటు అయే అవకాశం వున్నది.

## నర్సింగు స్కూళ్లు

వరంగల్లులో ఖాయమైన నర్సింగు స్కూలు నెలకొల్పబడినది.

## వ్యయం, భావి ప్రణాళికలు

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక తొలి సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో యేమీ ఖర్చు జరుగలేదు. ఆంధ్రప్రాంతంలో కేవలం రూ. 24 లక్షలు మాత్రమే ఖర్చుఅయినవి. రెండవ సంవత్సరంలో తెలంగాణా ప్రాంతంలో రూ. 25 లక్షలు, ఆంధ్రప్రాంతంలో రూ. 40 లక్షలు ఖర్చుఅయినవి. దీనితో మొత్తం రూ. 89 లక్షలు ఖర్చు అయినవి. ప్రణాళిక 3,4,5 సంవత్సరాలలో ఖర్చు చేయవలసిన సొమ్ము యింకా రూ. 5.44 కోట్లు మిగిలివున్నది. ప్రణాళిక తృతీయ సంవత్సరంలో బడ్జెట్ కేటాయింపు తెలంగాణా ప్రాంతానికి యించుమించు రూ. 40 లక్షలు, ఆంధ్ర ప్రాంతానికి రూ. 76 లక్షలు. మొత్తం రూ. 1.16 కోట్లు అయివున్నది. ఈ సంవత్సరంలో యీ బడ్జెట్ కేటాయింపును పూర్తిగా ఖర్చు చేస్తామనుకున్నా, 4,5 సంవత్సరాలలో ఖర్చు చేయవలసినది యింకా రూ. 4.28 కోట్లు వుంటుంది. 4,5 సంవత్సరాల బడ్జెట్ కేటాయింపును 3వ సంవత్సరం కేటాయింపుతో సమానంగా వుంచినట్లయితే, రాష్ట్రంలో వైద్య, ఆరోగ్య వసతుల అభివృద్ధికై యెంతో ఆలోచించి తయారుచేసిన వైద్య పథకాలకు కేటాయించిన స్వల్ప మొత్తంలో దాదాపు రూ. 2 కోట్లు

పోతారు. మన వశం కాని పరిస్థితుల మూలంగా తొలి, మలి సంవత్సరాలలో ఖర్చు తక్కువగా జరిగింది. అందుచేత, మొత్తం కార్యక్రమాన్ని మరొక సారి పరిశీలించి యెక్కువ పథకాలను చేర్చుటకు కృషి చేయాలి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆఖరి రెండు సంవత్సరాలలోను చేపట్టదగు అదనపు పథకాలలో కొన్ని దిగువ యివ్వబడినవి :

1. హైదరాబాదు వుస్మానియా జనరల్ ఆస్పత్రిలో నర్సెస్ హోం నిర్మాణం 13 లక్షలు

(ప్రతిపాదన సమర్పించబడింది)

2. హైదరాబాదు వుస్మానియా జనరల్ ఆస్పత్రిలో ఔట్ పేషెంటు శాఖ నిర్మాణం 23 ,,

3. నిలోఫర్ ఆస్పత్రిలో ఔట్ పేషెంటు బ్లాకు నిర్మాణం 5 ,,

4. హైదరాబాదు సరోజినీదేవి ఆస్పత్రి ఔట్ పేషెంటు శాఖ నిర్మాణం 4 ,,

(ప్రతిపాదన సమర్పించబడింది)

5. ప్రభుత్వ ప్రసూతి ఆస్పత్రిలో ఔట్ పేషెంటు శాఖ, ఆపరేషన్ థియేటర్ బ్లాక్ నిర్మాణం 4 ,,

6. వరంగల్లు జిల్లా ఆస్పత్రి అభివృద్ధి పనులు (ప్రతిపాదనలు సమర్పించబడినవి) 10 ,,

7. వరంగల్లులో వైద్య కళాశాల భవనాలు 10 ,,

8. మహబూబునగరంలో కొత్త ఆస్పత్రి 3 ,,

9. ఖమ్మంలో కొత్త ఆస్పత్రి 3 ,,

10. తిరుపతిలో కొత్త ఆస్పత్రి నిర్మాణం (మంజూరైనది) 15 ,,

11. శ్రీకాకుళం, నెల్లూరులలో కొత్త ఆస్పత్రుల నిర్మాణం 6 ,,

12. విజయవాడలో ప్రస్తుతం వున్న ఆస్పత్రి అభివృద్ధి 3 ,,

13. ఖమ్మం, మహబూబునగరాలలో కొత్త ఆస్పత్రి భవనాల నిర్మాణం 6 ,,

14. కాకినాడ హెడ్ క్వార్టర్సు ఆస్పత్రిలో ఔట్ పేషెంటు శాఖ నిర్మాణం 12 ,,

15. ఇంతవరకూ నెలకొల్పబడిన 85 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలన్నిటిలోను నివాసగృహాలు 8.50 ,,

మొత్తం 115.50 ,,

ఉస్మానియా వైద్య కళాశాల పథకం (దీనికి రూ. 65 లక్షల భవనాలు మంజూరైనవి) తోపాటు పై పథకాలను వెంటనే చేపట్టినట్లయితే, ఖర్చు తగ్గకుండా వుండగలదని భావించబడుతున్నది.

## నర్సింగ్ కళాశాల

హైదరాబాదు వుస్మానియా జనరల్ ఆస్పత్రిలోని నర్సింగు స్కూలులో, టి. సి. ఎమ్. సహాయంతో, వచ్చే విద్యా సంవత్సరం నుంచి బి. ఎస్. సి. నర్సింగు కోర్సులను ప్రారంభించాలని సంకల్పించబడింది. ఏటా 20 మంది విద్యార్థులను చేర్చుకోవాలని సంకల్పించబడింది. ఈ చదువు 4 సంవత్సరాలు చదువాలి. తరువాత ఈ కళాశాలకు నర్సెస్ హోం నిమిత్తం నిర్మించబడే కొత్త భవనాలలో వసతి కల్పించబడుతుంది. 4 గురు లెక్చెరియన్లను, విద్యార్హత గల ఒక నర్సు ఎడ్యుకేటర్ ని, ఒక క్లినికల్ ఇనస్ట్రక్టర్ ని, 2 రు పబ్లిక్ హెల్తు నర్సులను, బోధనా సాధనాలు,

పరికరాలను టి. సి. ఎమ్. సమకూరుస్తుంది. బి. ఎస్. సి. నర్సింగు కోర్సును అనుబంధించుకొనుటకు ఉస్మానియా విశ్వవిద్యాలయం సమ్మతించింది. ఇద్దరు నర్సింగు ఆఫీసర్లకు అమెరికాలో నర్సింగు ఫెకల్టీలో 2 సంవత్సరాల వరకూ శిక్షణ యిచ్చే బాధ్యతను స్వీకరించుటకు కూడా టి. సి. ఎమ్. అంగీకరించింది.

ఈ నర్సింగు కళాశాల ఇండియాలో 3 వది కాగలదు. మిగిలిన రెండూ వెల్లూరు, న్యూఢిల్లీలలో వున్నాయి.

వరంగల్లు, కాకినాడలలో వైద్య కళాశాలలు మహబూబ్‌నగరం, ఖమ్మం, నెల్లూరు, శ్రీకాకుళం మున్నగు ప్రదేశాలలో కొత్తజిల్లా ఆస్పత్రుల స్థాపన వంటి క్రొత్త పథకాలను చేపట్టినట్లయితే చాలా వరకూ ఖర్చు తగ్గకుండా వుంటుంది.

—(హైదరాబాదులో క్షయ, గుండె జబ్బుల సంస్థ శంకుస్థాపనోత్సవంలో చేసిన ప్రసంగం నుంచి.)



# తిరుపతిలో యాత్రికుల సౌకర్యార్థం

బొంబాయికి చెందిన దానధర్మశీలి శ్రీ ఆర్. ఆర్. రూయా తిరుపతిలో యాత్రికుల సౌకర్యార్థం క్రొత్తగా ఒక ఆస్పత్రిని నిర్మించటానికి దేవస్థానం వారు తనతో సమానమైన మొత్తమును విరాళం యిచ్చే యెడల తాను అయిదు లక్షల రూపాయలు విరాళంగా ఇస్తానని వాగ్దానం చేశారు. దేవస్థానం వారు రు. 15 లక్షలతో పెద్ద ఆస్పత్రి నిర్మించటానికి వీలుగా 24-3-1956 తేదీ గల 548 వ తీర్మానంలో రు. 10 లక్షలు విరాళం ఇవ్వటానికి తీర్మానించారు. ఆస్పత్రి కొఱకు పైన పేర్కొన్న విరాళాలను స్వీకరించటానికి 28-8-1957 న ప్రభుత్వం అంగీకరించింది. మొదట్లో యీ ఆస్పత్రిలో 100 మంచాలకు (50 వైద్య వసతికి, 50 ఆపరేషన్లకు) వసతి వుంటుంది. అధునాతన సౌకర్యాలు, సామగ్రి, ఫిట్టింగులు, ఆస్పత్రి బ్లాకులు, సిబ్బంది గృహాలు ఏర్పాటు చేయబడుతవి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో యీ ఆస్పత్రి నిర్మాణపు ఖర్చు రు. 15 లక్షల వరకే పరిమితం చేయబడుతుంది. ఈ ఆస్పత్రికి "రామనారాయణ్ రూయా ఆస్పత్రి" అని నామ కరణం చేయాలని ఉద్దేశం. దీనిని ప్రభుత్వమే నిర్వ హిస్తుంది. ప్రస్తుతం తిరుపతిలో ఉన్న ఆస్పత్రిని స్త్రీల, పిల్లల ఆస్పత్రిగా మార్చాలని కూడా ప్రతిపాదించ బడింది.

ప్రభుత్వంచే ఏర్పాటు చేయబడిన రూయా ఆస్పత్రి సలహాసంఘ సమావేశం 10-7-58 న తిరుపతిలో జరిగింది. ఆస్పత్రి ప్లానులు, అంచనాలకు తుదిస్వరూపం ఇవ్వటానికి యీ సమావేశం ఏర్పాటు చేయబడింది. శ్రీ రూయా యీ సమావేశంలో రు. 5 లక్షల ఒక్క రూపాయ చెక్కును ఆరోగ్య,



రాష్ట్ర ప్రభుత్వ కార్యదర్శికి శ్రీ రాధాకృష్ణ రూయా చెక్కును అందజేస్తున్న దృశ్యం.



రామనారాయణ రూయా ఆస్పత్రి సలహా సంఘం సభ్యులు

కుడినుంచి యెడమకు :- శ్రీ హాస్మత్‌రజా, స్టేట్ ఆర్కిటెక్టు
శ్రీ అన్నారావు, తిరుపతి, తిరుమల దేవస్థానాల కార్య నిర్వహణాధికారి.
మేజర్ కె. ఎన్. రావు, వైద్యశాఖ డైరెక్టరు.
శ్రీ బాలపెర్‌షాద్, భవనాల చీఫ్ ఇంజనీరు
శ్రీ ఎల్. ఎన్. గుప్త, ఐ. ఏ. ఎస్., ఆరోగ్య, స్థానిక పరిపాలన శాఖ కార్యదర్శి.
శ్రీ రాధాకృష్ణ రూయా
శ్రీ ఆలపాటి వెంకటరామయ్య, శాసనసభ్యుడు.
శ్రీ నాదమునిరెడ్డి, శాసనసభ్యుడు.
శ్రీ హేమచందర్, చిత్తూరు జిల్లా వైద్యాధికారి
శ్రీ సూర్యప్రకాశరావు, ఐ. ఏ. ఎస్., చిత్తూరు జిల్లా కలక్టరు.

స్థానిక పరిపాలనశాఖా కార్యదర్శి శ్రీ ఎల్.ఎన్.గుప్త, ఐ. ఏ. ఎస్. గారికి అందించారు. దేవస్థానంవారు తమ విరాళం రు. 10 లక్షలు లోగడనే చెల్లించారు. భూరి విరాళాలు యిచ్చిన శ్రీ రూయాకుటుంబానికీ, దేవస్థానం వారికీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తరఫున శ్రీ ఎల్. ఎన్. గుప్త కృతజ్ఞత లర్పించారు.

దేవస్థానంవారు యిచ్చిన 200 ఎకరాల స్థలంలో ఆస్పత్రి భవనాల నిర్మాణ కార్యక్రమం త్వరలోనే ప్రారంభమవుతుంది. ఈ స్థలం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ఆవరణకు సమీపంలో ఉంది. భవనాలు పూర్తిఅయిన తర్వాత, తిరుమలకొండ మీద నుండి చూస్తే, అవి చాలా అందంగానూ, శోభాయమానంగానూ కనబడుతవి. అప్పుడు ప్రతినిత్యం శ్రీ వేంకటేశ్వరాలయాన్ని సందర్శించే వేలాది యాత్రికులకూ, ఇతరులకూ వైద్య సహాయం లభిస్తుంది.

పోను పోను యీ ఆస్పత్రిలో మంచాల సంఖ్య 350–400 వరకు పెంచటానికి అవకాశం కలుగవచ్చు. అది బోధనా ఆస్పత్రికి కేంద్రంగా రూపొంది వైద్యకళాశాల స్థాపనకు దారితీయవచ్చు కూడా.

చర్చాగోష్ఠి

# రాష్ట్రంలో పారిశ్రామిక కేంద్రాలు

**మన రాష్ట్రంలో నెలకొల్పబడుతున్న పారిశ్రామిక కేంద్రాలపై 28-8-58 న ఆలిండియా రేడియో హైదరాబాదు కేంద్రంనుంచి చర్చాగోష్ఠి ఒకటి ప్రసారమయింది. ఆ చర్చలో రాష్ట్రీ పరిశ్రమలు, వాణిజ్య శాఖ జాయింటు డైరెక్టరు శ్రీ బి. నరసింహారావు బి. ఇ., హైదరాబాదు మహా విద్యాలయం ప్రిన్సిపాలు శ్రీ పి. పోలిరెడ్డి, జర్నలిస్టు శ్రీ కృష్ణ మోహన్‌లు పాల్గొన్నారు. వివరాలు సంగ్రహంగా దిగువ యివ్వబడినవి :**

శ్రీ పోలిరెడ్డి : చిన్న రకం పరిశ్రమల అభివృద్ధికై ఆంధ్ర ప్రదేశ్‌లో పారిశ్రామిక కేంద్రాల స్థాపననుగురించి చాలా వింటున్నాం. పరిశ్రమలు, వాణిజ్యం జాయంటు డైరెక్టరుగా, మన రాష్ట్రంలో యీ పారిశ్రామిక కేంద్రాల స్థాపనతో మీకు సన్నిహిత సంబంధం వుంటుంది. ఈ పారిశ్రామిక కేంద్రాలనే మాట మనదేశానికి కొత్తదిగా కనపడుతున్నది, వాటి సంగతి మాకు చెబుతారా ?

శ్రీ నరసింహారావు : చెబుతాను పోలిరెడ్డి గారూ ! బహుశా మన రాష్ట్రంలో చిన్న తరహా పారిశ్రామికులు అనేకుల మనసులలో మెదిలే యీ ప్రశ్నను మీరు అడుగుటవల్ల నిజంగా నాకు చాలాసంతోషంగా వుందండీ. మీరు చెప్పినట్టు యిటీవలివరకూ మన రాష్ట్రంలో పారిశ్రామిక కేంద్రం అనేమాట కొత్తగానే వుండేది. నివాసానికి, ఒక పద్ధతి ప్రకారం కుటీరాలను, గృహాలను, కాలనీలను నిర్మించినట్లే ఫ్యాక్టరీలను కూడా నిర్మించి చిన్నతరహా పరిశ్రమలకు వసతి సౌకర్యం కలిగించవచ్చు. పారిశ్రామిక కేంద్రంలో వేర్వేరు ప్రమాణాలలో ఫ్యాక్టరీ భవనాలు నిర్మించబడతాయి. అవి చిన్న తరహా పరిశ్రమలకు అద్దెకుకాని, మరొకలా కాని వెంటనే లభిసాయి. ఈకేంద్రం చక్కని ప్లాను ప్రకారం అభివృద్ధిపరచబడి, నిర్మాణాలుగల ప్రదేశంగా వుంటుంది. అక్కడ విద్యుచ్ఛక్తి, నీరు, మురుగు పారుదల, రవాణా మున్నగు మామూలు సౌకర్యాలన్నీ సమకూర్చబడతాయి.

శ్రీ కృష్ణమోహన్ : అయితే యిది చాలా వుపయోగకరమైనదిగానూ, చిన్నతరహా పారిశ్రామికులకు వరప్రసాదం గానూ వుండేట్టు కనబడుతోందండీ, నరసింహారావుగారూ. అట్టి పారిశ్రామిక కేంద్రాలను ప్రారంభించుటలో ప్రభుత్వం ఆశయాలేమిటో వివరిస్తారా ?

శ్రీ నరసింహారావు : వివరిస్తాను, కృష్ణమోహన్‌గారూ. చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధికి చాలా ఆటంకాలు వున్నాయి. దేశంలో పలుప్రాంతాలలో చెదరివున్న చిన్న తరహా పారిశ్రామికులు అనేక రకాల వస్తువులను, యెక్కువగా ప్రజల దైనందిన జీవితానికి అవసరమైన వినియోగ వస్తువులను తయారు చేస్తున్నారు. కాని, దురదృష్టవశాత్తూ దేశంలోని చిన్నతరహా పారిశ్రామికులలో చాల మందికి తమ పరిశ్రమకి తగిన స్వంత ఫ్యాక్టరీని కలిగివుండే స్తోమత లేదు. పట్టణ ప్రాంతాలలో సరసమైన అద్దెకు వారికి కావలసిన వసతి లభించుటయూ లేదు. మొట్టమొదట భూమిని కొని, అక్కడ ఫ్యాక్టరీ

నిబంధనలు, ఆరోగ్య సూత్రాలు, మునిసిపల్ నిబంధనలు మున్నగు వాని కనుగుణంగా భవనాలను నిర్మించుటకు చాల ఖర్చు అవుతుంది. దీనికి తగిన పెట్టుబడి వారికి వుండదు. ఆపైన పరిశ్రమ నెలకొల్ప దలుచుకున్న వ్యక్తి నీరు, విద్యుచ్ఛక్తి మున్నగు సౌకర్యాలను సంపాదించుటకు చాల శ్రమపడాలి. ఎందువల్లనంటే, అతడు అందు నిమిత్తం యెన్నో సంస్థలను, శాఖలను చూడవలసి వుంటుంది.

ఈ చిక్కులను తొలగించి, చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడుటకై కేంద్ర ప్రభుత్వం, దేశమంతటా తగిన ప్రదేశాలలో పారిశ్రామిక కేంద్రాలను నెలకొల్పుటకు 'పాలసీ డెసిషన్'ని తీసుకున్నది.

## చిన్న తరహా పరిశ్రమలపాత్ర

శ్రీ పోలిరెడ్డి : బాగానేవుంది కాని నరసింహారావు గారూ, నా కొక్క సందేహం కలుగుతోందండీ. ఇప్పుడు మీరు చెప్పిన చిక్కులన్నిటిని కుటీర పరిశ్రమలు, మధ్యరకం పరిశ్రమలూ కూడా యెదుర్కొంటున్నాయికదా. మరి ఒక్క చిన్నతరహా పరిశ్రమల నిమిత్తమే యెందుకు వుద్దేశించబడాలి, యీ పారిశ్రామిక కేంద్రాలు ?

శ్రీ నరసింహారావు : చెబుతాను వినండి. ఈనాడు పరిశ్రమాభివృద్ధి విషయంలో కొన్ని సమస్యలు వుత్పన్న మవుతున్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో వుద్దేశించిన ప్రకారం పారిశ్రామికీకరణ కొనసాగాలంటే వాటిని పరిష్కరించాలి. ఆధునిక విధానాలను, పరికరాలను వుపయోగిస్తూ వుద్యోగానికి, వస్తూత్పత్తికి మధ్యగల సంబంధాన్ని సరైన స్థితిలో వుంచవలసి వున్నది. ఇది ముఖ్యంగా చేయవలసిన పనులలో ఒకటి. ఈ సమస్యా పరిష్కారానికి చిన్నతరహా పరిశ్రమ సాటి లేని అవకాశాన్ని కలిగిస్తుంది. అవసరమైనప్పుడు ప్రభుత్వసహాయంతో, స్వల్ప పెట్టుబడి గల వ్యక్తులచే ప్రైవేటు విభాగంలో అభివృద్ధి పొందించుటకు యీ తరహా పరిశ్రమలు ముఖ్యంగా తగివున్నవి. కాబట్టి, వుద్యోగాలకు అదనపు మార్గాలను చూపించి ఆదాయాలను, జీవన ప్రమాణాలను హెచ్చించుటలో చిన్నతరహా పరిశ్రమలు ముఖ్య పాత్ర వహించాలని నిర్ణయించబడింది. అయితే కుటీర, గ్రామపరిశ్రమల అభివృద్ధికై చిన్న చిన్న గ్రామీణ పారిశ్రామిక కేంద్రాలు కూడా నెలకొల్పబడగలవు.

శ్రీ పోలిరెడ్డి : చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధిలో పారిశ్రామిక కేంద్రాలు వహించగల ముఖ్య పాత్ర నాకు యిప్పుడు అర్థమైందండీ. పారిశ్రామిక కేంద్రాలలో నెలకొల్పబడిన పరిశ్రమలకు అదనపు సౌకర్యాలు, లాభాలు యేమైనా వుంటాయా ?

శ్రీ నరసింహారావు : తప్పకుండా వుంటాయి పోలిరెడ్డిగారూ. తపాలా కార్యాలయం, బ్యాంకు, కాంటీను, రిక్రియేషన్ రూం, కార్మికులకు ప్రథమ చికిత్సా సౌకర్యాలు, సాంకేతిక సహాయ కేంద్రాలవంటి అదనపు సౌకర్యాలు కూడా కలిగించబడతాయి. పారిశ్రామిక కేంద్రంలో పరిశ్రమలు ఒకదాని కొకటి దగ్గరగా వుంటాయికనుక ఒకదాని మనుషులను, వస్తువులను మిగిలినవి వుపయోగించుకుంటూ ఆ విధంగా పరస్పర పరిపూరకంగా వుండగలవు. ఈ పారిశ్రామిక కేంద్రాలలో వుండే ముఖ్య సౌకర్యం యేమిటంటే, అక్కడ సాధారణ సర్వీసు కేంద్రాలు వుంటాయి. వీటిని అద్దెకున్న పారిశ్రామికులు సహకారపద్ధతిపై స్వయంగా యేర్పరుచుకోవచ్చు లేదా పారిశ్రామిక కేంద్రాల అధికారులే యేర్పరచవచ్చు.

## సాధారణ సర్వీసు కేంద్రాలు.

శ్రీ కృష్ణమోహన్ : సాధారణసర్వీసు కేంద్రాలంటే యేమిటండీ ?

శ్రీ నరసింహారావు : అది చెబుతాను కృష్ణమోహన్ గారూ. సాధారణ సౌకర్యం లేక సాధారణ సర్వీసు కేంద్రాలలో లోహపరీక్ష, యెనామిలు చేయుట మున్నగు పనులు సరసమైన రేటుపై జరిగే సౌకర్యం కల్పించబడుతుంది. ఒకదానిప్రక్క మరొకటి చాల పరిశ్రమలు నెలకొల్పబడినప్పుడే అట్టి సౌకర్యాలను సమకూర్చడం సాధ్యపడుతుంది. చిన్నతరహా పరిశ్రమ ఒక్కొక్కటి విడివిడిగా అట్టి సౌకర్యాలను యేర్పరుచుకుంటే అది లాభకరం కాదు. దానికి అందుకు తగిన స్తోమతకూడా వుండకపోవచ్చు.

శ్రీ పోలిరెడ్డి : బాగుందండీ నరసింహారావుగారూ, మన రాష్ట్రంలో నెలకొల్ప సంకల్పించబడిన వివిధ పారిశ్రామిక కేంద్రాలు, వాటి మొత్తం పెట్టుబడికి సంబంధించిన వివరాలు తెలియజేస్తారా ?

శ్రీ నరసింహారావు : ఇంతవరకూ, సనత్‌నగరం, విశాఖపట్నం, విజయవాడ, సామర్లకోటలలో మొత్తం యించుమించు రూ. 88 లక్షల ఖర్చుపై నాలుగు పారిశ్రామిక కేంద్రాలు మంజూరు చేయబడినవి. వీటిలో సనత్‌నగరం, విశాఖపట్నాలలోని కేంద్రాలు భారీ కేంద్రాలు. ఒక్కొక్కదానికి యించుమించు రూ. 30 లక్షలు ఖర్చు కాగలవు. విజయవాడ కేంద్రం రూ. 20 లక్షలు ఖర్చయే మధ్యరకం కేంద్రంకాగా సామర్లకోట కేంద్రం దానికంటె కూడా చిన్నది. దాని ఖర్చు రూ. 7 లక్షలు మాత్రమే. నంద్యాలలో సమాజాభివృద్ధి కేంద్రంలో రూ. 3 లక్షల ఖర్చుతో ఒక గ్రామీణ పారిశ్రామిక కేంద్రాన్ని, తెలంగాణా ప్రాంతంలో హైదరాబాదు, సికింద్రాబాదుల తర్వాత ముఖ్యమైన పారిశ్రామిక ప్రాంతమైన వరంగల్లులో రూ. 10 లక్షల ఖర్చుపై ఒక మధ్యరకం కేంద్రాన్ని నెలకొల్పుట కుద్దేశించిన ప్రతిపాదనలు సమర్పింపబడినవి. గుంతకల్లు, నిజామాబాదు, రాజమండ్రి, కాకినాడ, తిరుపతి, బోధన్ మున్నగు పారిశ్రామికంగా ముఖ్యమైన వివిధ ప్రదేశాలలో రూ. 3-5 లక్షల ఖర్చుపై చిన్న చిన్న పారిశ్రామిక కేంద్రాల ప్రారంభం నిమిత్తం కేంద్ర ప్రభుత్వంతో మేము వుత్తర ప్రత్యుత్తరాలను జరుపుతున్నాముకూడా. ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద ఆంధ్రప్రదేశ్‌లో పారిశ్రామిక కేంద్రాల స్థాపనకై అధమం రూ. 125 లక్షలనైనా కేటాయించమని కూడా మేము కేంద్ర ప్రభుత్వాన్ని అడుగుతున్నాం.

శ్రీ కృష్ణమోహన్ : మీరు చెప్పిన ప్రకారం, నాలుగు పారిశ్రామిక కేంద్రాలు యిదివరకే ప్రభుత్వంచే మంజూరు చేయబడినవి. అందుకు సంబంధించిన పని జరుగుతున్నదని నమ్ముతాను. అది యెంతవరకూ వచ్చిందో చెబుతారా ?

శ్రీ నరసింహారావు : భూమి సంపాదన, కేంద్రం లేఅవుట్, ఫ్యాక్టరీ యూనిట్ల బ్లూప్రింట్ల తయారీ మున్నగునవి, వీటి విషయంలో సాధారణంగా వచ్చే చిక్కులను అధిగమించి, పూర్తిచేయబడినవి. సనత్‌నగరంలోని పారిశ్రామిక కేంద్రం 49.25 యెకరాల స్థలంలో నెలకొల్పబడుతున్నది. ఈ స్థలం సనత్‌నగరంలో హైదరాబాదు ఆస్బెస్టాస్ సిమెంటు వస్తువుల కంపెనీ పక్కన, కార్మిక గృహావసతి కాలనీముందు వున్నది. ఇక్కడ యీ పథకం క్రింద నెలకొల్ప సంకల్పించబడిన 30 ఫ్యాక్టరీ యూనిట్లలోను 17 యూనిట్లు పూర్తి కావస్తున్నాయి.

శ్రీ పోలిరెడ్డి : ఈ యూనిట్లు వాడకానికై యెప్పటికి సిద్ధం కాగలవని భావిస్తున్నారుమీరు ?

శ్రీ నరసింహారావు : ఫ్యాక్టరీ యూనిట్లు, వాటికి అవసరమైన సౌకర్యాలు ఒకేసారి అభివృద్ధి పరచబడుతున్నాయి. అవి వాడకానికై

1958 సెప్టెంబరు నాటికి సిద్ధం కాగలవని మేము భావిస్తున్నాం.

విశాఖపట్నంలో యీ కేంద్రం నెలకొల్పుటకై 51.52 యెకరాల భూమి సంపాదించబడింది. ఈ పథకం క్రింద నిర్మించాలని సంకల్పించిన 38 ఫ్యాక్టరీ భవనాలలోను 20 భవనాల విషయంలో అభివృద్ధి తొలి దశలో పని జరుగుతున్నది. ఈ యూనిట్లు 1958 నవంబరు నాటికి పూర్తి కాగలవని భావిస్తున్నాం.

విజయవాడ కేంద్రం, పటమట గ్రామంలో విజయవాడ — మచిలీపట్నం ట్రంకు రోడ్డుపై 53.98 యెకరాల స్థలంలో నెలకొల్పబడుతున్నది. ఈ పథకం క్రింద 18 ఫ్యాక్టరీ యూనిట్లను నెలకొల్పాలని సంకల్పించబడింది. ఇప్పుడు 10 యూనిట్లు నిర్మించబడుతున్నాయి. అవి 1958 డిసెంబరు నాటికి వాడకానికి సిద్ధం కాగలవని భావించబడుతున్నది.

సామర్లకోట కేంద్రం విషయంలో 10.75 యెకరాల ప్రభుత్వ భూమి మా శాఖచే తీసుకొనబడింది. అక్కడ యీ కేంద్రం నెలకొల్పబడుతుంది. మొదటి దశలో యించుమించు 12 ఫ్యాక్టరీ యూనిట్ల నిర్మాణం త్వరలోనే చేపట్టబడుతుంది.

### ఫ్యాక్టరీ యూనిట్లు

(శ్రీ) పోలిరెడ్డి : అయితే యీ పారిశ్రామిక కేంద్రాలలోని ఫ్యాక్టరీ భవనాలు యేరకానివో, వాటిలో వసతి యేమేరకు లభ్యమవుతుందో తెలియజేస్తారాండి, నరసింహారావు గారూ.

(శ్రీ) నరసింహారావు : తప్పకుండాను. రాష్ట్రవ్యాప్త ప్రాతిపదికపై ఫ్యాక్టరీ యూనిట్ల ప్రమాణీకృతమైన అనేక రకాల నమోనాలు రూపొందించబడ్డాయి. భారీ, మధ్యరకం కేంద్రాలన్నిటిలోను ఎ, బి, సి, డి తరగతి యూనిట్లు, చిన్న తరహా పారిశ్రామిక కేంద్రాలలో ఇ, ఎఫ్, జి. తరగతి యూనిట్లు నిర్మించబడుతున్నాయి. ఎ తరగతి ఫ్యాక్టరీ యూనిట్లకి మొత్తం యించుమించు 9000 చ. అడుగుల వేలవుంటుంది. అది బి తరగతి విషయంలో 4,700 చ. అ., సి తరగతి విషయంలో 3,200 చ. అ., డి తరగతి విషయంలో 2,000 చ. అ., ఇ తరగతి విషయంలో 2,500 చ. అ., ఎఫ్ తరగతి విషయంలో 1,500 చ. అ., జి తరగతి విషయంలో 950 చ. అ. వుంటుంది. ఇవి ఫ్యాక్టరీ నిబంధనలకు, మునిసిపలు నియమాలకు అనుగుణంగా నిర్మితమై సాధారణ ప్రయోజనం ఫ్యాక్టరీ అవసరాలకు తగినట్లు వుంటాయి. ఒక్కొక్క ఫ్యాక్టరీకి చుట్టూ భవనానికి దాదాపు 4,5 రెట్లవిస్తీర్ణంగల ఆవరణవుంటుంది. దానికి అడ్డుకట్టబడుతుంది. ఈ భవనాలలో ఫ్యాక్టరీ భాగంలో యంత్రాలను, పరికరాలను సులభంగా అమర్చుకొనుటకై స్తంభాలు (ఎ, తరగతి యూనిట్టులో మాత్రం రెండే రెండు స్తంభాలు వున్నాయి) లేకుండానిర్మాణం జరుపబడుతున్నది. సరిపడిన వెల్తురు సరిసమంగా వచ్చుటకై ఫ్యాక్టరీ యూనిట్లు అన్నిటి విషయంలో నార్త్ లైట్ రూఫింగ్ అవలంబింపబడుతున్నది. భవనంలో నిర్వహణ కార్యకలాపాలు జరిగే భాగం పై కప్పుకి ఆర్. సి, పలకలు, ఫ్యాక్టరీ భాగం పై కప్పుకి ఏ. సి. రేకులు వుపయోగించబడతాయి. ఫ్యాక్టరీ షెడ్డులో మర తలుపులు అమర్చబడతాయి. ఏ తరగతి యూనిట్లు ఒక్కొక్కటి విడివిడిగా నిర్మిత మవుతాయి. చుట్టూ ఆవరణ వుంటుంది. మిగిలిన తరగతుల యూనిట్లు వుమ్మడి గోడతో జంటగా నిర్మించబడుతాయి. అవసరమైతే రెండు బ్లాకులను ఒక్క పరిశ్రమకే వుపయోగించుకోవచ్చును. పారిశ్రామికుడు కోరితే భవనాలకు స్వల్పమైన మార్పులు

చేర్పులు వగైరా జరుపుటకు అనుమతింప బడవచ్చు. లోపల యంత్రాలు మున్నగు వాటి అమరిక విషయంలో వాడకం దారులు తమ తమ అవసరాలకు అనుగుణంగా, ఫ్యాక్టరీ నిబంధనలు, యెస్టేటు రెగ్యులేషన్‌లకు భంగకరం కాకుండా యేర్పాట్లుచేసుకోవచ్చు.

శ్రీ కృష్ణమోహన్: ఇందుకు కేంద్ర ప్రభుత్వం నుంచి మీకు సహాయం లభిస్తున్నదనుకుంటాను. నా వూహ నిజమేనాండీ?

శ్రీ నరసింహారావు: నిజమేనండి కృష్ణమోహన్ గారూ, మీరు సరిగ్గా వూహించారు. పారిశ్రామిక కేంద్రాలకయే యావత్తు ఖర్చు యేటా 4-1/2% వడ్డీపై కేంద్రప్రభుత్వం నుంచి అప్పుగా లభిస్తున్నది. దీనిని 20-30 సంవత్సరాలలో తీర్చాలి. ఇదిగాక, యెస్టేటు ప్లాన్‌లు, నమూనాలు, అంచనాలు మున్నగు వాటి ఖర్చుకై కేంద్రప్రభుత్వం గ్రాంటులను కూడా మంజూరు చేస్తున్నది.

శ్రీ పోలిరెడ్డి: అయితే నరసింహారావుగారూ, పారిశ్రామిక కేంద్రంలోని ఫ్యాక్టరీ యూనిట్లను పారిశ్రామికులు కొనుక్కొనుటకు అనుమతించబడుతుందాండీ?

శ్రీ నరసింహారావు: ఆఁ, ఆఁ. ఆమాటే నేనూ చెప్పబోతున్నాను. పారిశ్రామిక కేంద్రాలలోని ఫ్యాక్టరీ భవనాలు చిన్నతరహా పారిశ్రామికులకు మూడు పద్ధతులలో అందుబాటులో వుంటాయి. మొదటిది, అద్దెకు యివ్వబడతాయి; రెండవది, అద్దె-కొనుగోలు పద్ధతిపై యివ్వబడతాయి; మూడవది, ఒకే సారి అమ్మబడతాయి.

భవనంలో ప్రవేశించుటకు ముందు దానిని అద్దెకు తీసుకునేవారు ఒక ఒప్పందాన్ని చేసుకోవలసివుంటుంది. ఆ ఒప్పందం ముఖ్యాంశాలు యివి: నెలఅద్దె ముందుగా యివ్వాలి; నీరు, విద్యుచ్ఛక్తి సరఫరాలకయే ఖర్చు విడిగా రాబట్టబడుతుంది; యెస్టేటు ఆస్తి పన్నును చెల్లిస్తుంది; మిగిలిన పన్నులన్నిటినీ అద్దెకున్నవారు చెల్లించాలి; అద్దెకున్నవారు భవనాన్ని ప్రభుత్వంపేర భీమా చేయించాలి. ఎస్టేటు నిర్వాహకులముందుఅనుమతిలేనిదే అద్దెకున్నవారు భవనాలకు యెటువంటి మార్పులు యేర్పాటు చేయరాదు. ఆ భవనాన్ని ఫ్యాక్టరీలా నడిపే విషయంలో యెస్టేటు నిర్వాహకులు, అమలులోవున్న అన్ని నిబంధనలు, నియమాలు, చట్టాలు అమలుజరిగేట్టు చూస్తారు.

శ్రీ కృష్ణమోహన్: బాగుందండి నరసింహారావు గారూ. ఒక్క విషయం, పారిశ్రామిక కేంద్రాలలో ఫ్యాక్టరీ వసతికై దరఖాస్తు యెలా పెట్టాలంటారు?

శ్రీ నరసింహారావు: పారిశ్రామిక కేంద్రాలలో ఫ్యాక్టరీ వసతి నిమిత్తం దరఖాస్తు పెట్టుటకు నిర్ణీతమైన ఫారాలు వున్నాయి. పరిశ్రమలు, వాణిజ్యశాఖ డైరెక్టరు, హైదరాబాదునుంచి కాని లేక ఆ పారిశ్రామిక కేంద్రాలు యెవరి అధ్వర్యంక్రింద నెలకొల్పబడినవో ఆ అసిస్టెంటు డైరెక్టర్ల (పరిశ్రమలు, వాణిజ్యశాఖ) నుంచి కాని తెప్పించుకోవచ్చు. ఆ ఫారాలను. ఫ్యాక్టరీ కేటాయింపుకై పంపే దరఖాస్తుతో బయానా సొమ్ముకూడా పంపాలి. దరఖాస్తుదారు కేటాయింపు జరిగిన తరువాత, ఫ్యాక్టరీ యూనిట్టును, ఒప్పందంలోని కాలవ్యవధిలో ఆక్రమించుకోని పక్షంలో ఆ కేటాయింపు రద్దు చేయబడి, బయానా సొమ్ము వశం చేసుకోనబడుతుంది.

శ్రీ పోలిరెడ్డి: పారిశ్రామిక కేంద్రాలవల్ల చిన్నతరహా పారిశ్రామికులకు కలిగే లాభాలు యేమిటో యిప్పుడు బాగా అర్థం అయింది మాకు. మన ప్రభుత్వం యింకా అట్టి కేంద్రాలను అనేకం నెలకొల్పి తద్వారా రాష్ట్రంలో అక్కడక్కడ చెదరివున్న పరిశ్రమల అవసరాలను తీర్చాలని మేము కాంక్షిస్తున్నాం.

—ఆలిండియా రేడియో సౌజన్యంతో

# ఆస్థాన కవికి సన్మానం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవి, కవిసార్వభౌమ శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారికి యీ సంవత్సరం స్వాతంత్ర్య దినోత్సవాన రాష్ట్రపతి గౌరవ సర్టిఫికెట్టును యిచ్చారు. ఇట్టి గౌరవ సర్టిఫికెట్టులను పొందిన ప్రసిద్ధ సంస్కృత విద్వాంసులు నలుగురిలో శ్రీ శాస్త్రిగారు ఒకరు.



శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి

ప్రసిద్ధులైన సంస్కృత, అరాబిక్, పెర్షియన్ విద్వాంసులను గుర్తించి, ఆ భాషలలో వున్నతపరిశీలనను ప్రోత్సహించుటకై యీ సంవత్సరం ప్రవేశపెట్టిన యీ పథకం వుద్దేశించ బడింది. సంస్కృత, పెర్షియన్, అరాబిక్ ప్రాచ్య భాషా రంగాలలో విశిష్టతను గణించిన వారికి యీ బహుమతులు యివ్వబడతాయి.

ఈ విద్వాంసులకు సనద్ తోపాటు జీవిత పర్యంతం సాలీనా రూ. 1,500 రొఖ్ఖం, పండిత శాలువ కూడా (రోబ్ అఫ్ ఆనర్) యివ్వబడతాయి.

మన ప్రభుత్వ ఆస్థానకవి శ్రీ శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారి వయస్సు 92 సంవత్సరాలు. వీరు సంస్కృతము, తెలుగు రెండు భాషలలోను కోవిదులు. సాహిత్య ప్రపంచంలో వారికిగల మహోన్నత స్థానాన్నిబట్టి వారికి 'మహో

మహోపాధ్యాయ,' 'కవిసార్వభౌమ,' 'కళా ప్రపూర్ణ' అనే బిరుదులు చేకూరాయి.

తెలుగు కవిత్వంలో శ్రీ శాస్త్రిగారు యించుమించు 225 పుస్తకాలు వ్రాశారు. మహాభారతాన్ని, రామాయణాన్ని, భగవద్గీతను ఆంధ్రీకరించారు (పద్యాలలో). వీరు శతావధానం చేశారు.

## పోలీసు పతకం

ఇదే సందర్భంలో పోలీసు పతకాలను స్వీకరించిన వారిలో హైదరాబాదు సిటీపోలీసు క్రైంబ్రాంచి పోలీసు అసిస్టెంటు కమిషనరు శ్రీ నిప్పాని నరసింహమూర్తికూడా వున్నారు.



శ్రీ నిప్పాని నరసింహామూర్తి



# అభివృద్ధి కార్యక్రమ కేంద్రాల విశేషాలు

## బంగారుపేటలో ప్రణాళికల మంత్రి

దేశాన్ని అభివృద్ధి చేసి, గ్రామాలను బాగుచేయుటకై వచ్చే 10, 15 సంవత్సరాలలో ప్రజలందరూ శాయశక్తులా కృషిచేయాలని రాష్ట్ర ప్రణాళికలు, అభివృద్ధి శాఖా మంత్రి శ్రీ వి. బి. రాజు కోరారు. దేశాన్ని యెదుర్కొనే వివిధ సమస్యల పరిష్కారానికి జనాభా పెరుగుదలను అరికట్టాలని చెబుతూ ప్రజలు ఆదాయానికి ఒక్క వ్యవసాయంపై ఆధారపడి వుండకుండా దానికితోడుగా కుటీర, గృహ పరిశ్రమలను చేపట్టాలని చెప్పారు.

తిరుపతినుంచి గూడూరుకు వెళ్లేమార్గంలో మంత్రిగారి ప్రసంగం వినుటకై బంగారుపేటలో యించు మించు 1000 గ్రామీణులు చేరారు. ఆయన ఆ సభలో ప్రసంగించారు.

బంగారుపేట గ్రామం చేరగానే ఆయనకు ఘనమైన స్వాగతం యివ్వబడింది. శాసన సభ్యులు శ్రీయుతులు వెంకటస్వామిరెడ్డి, అల్లంకృష్ణయ్యగారలు, జిల్లా ప్లానింగు ఆఫీసరు, స్థానిక వుద్యోగులు మున్నగువారు ఆయనకు స్వాగతం చెప్పారు.

బ్లాకు అభివృద్ధి అధికారి కార్యాలయంలో మంత్రిగారు బహిరంగసభలో మాట్లాడారు. శా. స. శ్రీ వెంకటస్వామిరెడ్డి ఆయనకు స్వాగతం చెబుతూ దేశంలో పేదల వుద్ధరణకై అవిరామంగా కృషి చేస్తున్నందుకు ఆయనను ప్రశంసించారు.

మంత్రిగారు తమ సమాధానంలో యిలా అన్నారు: "పూర్వాచారాలు, పాత నమ్మకాలు యింకా పోలేదు, అవి అభివృద్ధిని నిరోధిస్తున్నాయి. ఆలోచనాపద్ధతి, దృక్పథాలలో శీఘ్రంగా మార్పు రావాలి, యిదే యీ సమయంలో అత్యవసరం. ప్రజలు ఒకరినొకరు సందేహించడం విరమించి, సాంఘిక చెడుగులను నిర్మూలించి సంఘాన్ని పునర్నిర్మించాలి."

మారే పరిస్థితికి అనుగుణంగా వుద్యోగులుకూడా తమ దృక్పథాన్ని మార్చుకొని, వివిధ అభివృద్ధి పథకాల ప్రయోజనాలను సాధ్యమైనంత యెక్కువగా పొందడానికి ప్రజలకు తోడ్పడాలని చెబుతూ, నేడు ప్రజలు, వుద్యోగులు రెండు విడి విడి వర్గాలు కాదని, వుమ్మడి ప్రయోజనానికై కృషిచేసే ఒకే ఒక జట్టులోని వారనీ ఆయన అన్నారు. అంతాకూడా నూతన సాంఘిక వ్యవస్థ నిర్మాణానికై కృషి చేస్తున్నారన్నారు.

తరువాత మంత్రిగారు స్థానిక కార్యాలయ భవనాలను, మహిళా సమాజాన్ని తనిఖీ చేశారు. అటు పిమ్మట గూడూరుకి బయలుదేరి వెళ్లారు.

## కుటుంబానికొక ప్రణాళిక

ప్రతి కుటుంబము ఒక అభివృద్ధి ప్రణాళికను తయారు చేసుకొని, దేశాభివృద్ధికై నిరంతరం కృషి చేయాలని నెల్లూరు జిల్లా కలక్టరు శ్రీ వి. శ్రీనివాసాచారి, ఐ. ఎ. ఎస్. అన్నారు. జూలై 30 న నాయుడుపేటలో నాయుడుపేట అభివృద్ధికేంద్రం ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన ఆయన ప్రణాళిక విజయానికై వృద్ధులు, యువకులు కూడా తమతమ శక్త్యానుసారం తోడ్పడాలని చెప్పారు. నాయుడుపేట స్థానికనిధి ఆస్పత్రిలో ప్రత్యేకంవేసిన పందిటిలో జరిగింది యీ వుత్సవం.

అభివృద్ధికై కొత్త అభివృద్ధికేంద్రం యిచ్చే అవకాశాలను సాధ్యమైనంత యెక్కువగా వుపయోగించుకోవలసినది ప్రజలు అని యీ అభివృద్ధి కేం

ద్రాన్ని ప్రారంభించిన శాసనసభ్యులు శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి అన్నారు. ప్రజా సహకారం లభించిన మేరకే ప్రణాళిక విజయం చెందగలదని అంటూ, యిప్పుడు ప్రభుత్వ నీటి పారుదల విధానం మారిన దనీ, భారీ నీటి పారుదల వనరులకు కాక చిన్నరకం నీటి పారుదల వనరులకు ప్రాముఖ్యం యివ్వడం హర్షణీయమైన మార్పుఅనీ, యీ మార్పువల్ల నీటి పారుదలకు వర్షంపై ఆధారపడివున్న నాయుడు పేట అభివృద్ధికేంద్రం ప్రాంతాలకు మేలు కలుగు తుందనీ అన్నారు. అన్ని సౌకర్యాలను ఒకేసారి కల్పించుట సాధ్యంకాదనీ, ముందు ప్రాధాన్యత క్రమంలో అవి జరగాలనీ అంటూ, ప్రజలు కష్టించి పని చేయనిదే అభివృద్ధి సాధ్యం కాదన్న విషయాన్ని మరచిపోకూడదు అన్నారు.

మన గ్రామ ఆర్థిక వ్యవస్థ పూర్తిగా మారిపోయి నదనీ, గ్రామాలు పూర్వంవలె స్వయంపోషకంగా లేవని ఆయన అన్నారు. గ్రామాలు అభివృద్ధి చెందా లంటే వాటిలో ఉత్పత్తిని పెంచించాలి. సమాజాభి వృద్ధి కార్యక్రమం గ్రామాల అభివృద్ధికి కీలకమనీ, ప్రజలు దానిని పూర్తిగా ఉపయోగించుకోవాలనీ ప్రసంగాన్ని ముగిస్తూ ఆయన చెప్పారు.

శాసనసభ్యుడు శ్రీ మునుస్వామి, జిల్లా ప్లానింగు ఆఫీసరు శ్రీ పి. మల్లికార్జునం కూడా ఆ సందర్భంలో ఉపన్యసించారు. అంతకుముందు జరిపిన ఆట లలో గెలుపొందిన వారికి శ్రీ లీలా శ్రీనివాసా చారి బహుమతులను పంచిపెట్టారు. శ్రీ గురప్పసెట్టి వందన సమర్పణ చేశారు.

ఉదయం నాయుడుపేటలోని బ్లాకు అభివృద్ధి అధికారి కార్యాలయం యెదుట జిల్లా పోలీసు సూపరింటెండెంటు జాతీయ పతాకను ఆవిష్కరించారు. పాఠశాలల విద్యార్థులు, స్థానిక ప్రజలు నాయుడుపేట ప్రధాన వీధులలో వూరేగింపు జరిపారు. శ్రమదానోద్యమంలో భాగంగా నేలబల్లివద్ద రోడ్డుపని ఒకటి చేపట్టబడింది. ప్రారంభోత్సవ కార్యక్రమం వివిధ అంశాలలో చాలమంది ప్రజలు యెంతో వుత్సాహంతో పాల్గొన్నారు.

## గ్లిరిసిడియా వారం

తిర్మలాయపాలెంలో జూలై 1న గ్లిరిసిడియా వారోత్సవం జరుపబడింది. ఉదయం 8 గం. వూరేగింపు జరిగింది. ఊరేగింపు జనం చేతులలో గ్లిరిసిడియా కొమ్మల్ని పట్టుకుని గ్లిరిసిడియాపై నినాదాలు చేస్తూ గ్రామంలో బ్యాండు మేళంతో వూరేగారు. ఊరేగింపు అనంతరం బహిరంగసభ జరిగింది. అక్కడ వ్యవసాయంలో పచ్చియెరువుగా గ్లిరిసిడియా ప్రాముఖ్యం వివరించబడింది. సభ ముగిసిన తరువాత గ్లిరిసిడియా కొమ్మలు పెరటిలో పాతుకొనుటకై గ్రామస్థులకు యివ్వబడ్డాయి.

## చౌడేపల్లిలో

5-8-58న చిత్తూరు జిల్లా చౌడేపల్లిలో పూర్వ-విస్తరణ అభివృద్ధికేంద్రం ప్రారంభం సందర్భంగా, బడిపిల్లలు, స్థానికోద్యోగులు, అనధికారులు ఆ ఉదయం వూరేగింపు జరిపారు. ఆ తరువాత శ్రీ రాజా వీరబసవచిక్కరాయల్, వై. బి. శా. స., పతాకోత్సవాన్ని జరిపారు. ఆ తరువాత స్థానిక లోకల్ బోర్డు హైస్కూలులో పిల్లలకు మిఠాయిలు పంచిపెట్టబడ్డాయి.

చౌడేపల్లి, కూరపల్లిలను కలుపుతూ శ్రమదానంతో కచ్చారోడ్డు నిర్మించబడింది.

సాయంకాలం హైస్కూలులో బహిరంగసభ జరిగింది. దానికి పుంగనూరు తాలూకా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు, ఆం.ప్ర. కాం.క. సభ్యుడు అయిన శ్రీ ఇ. సి. గంగిరెడ్డి అధ్యక్షత వహించారు. ఆ సందర్భంలో చిత్తూరు జిల్లా కలక్టరు శ్రీ సి. సూర్యప్రకాశరావు మాట్లాడుతూ అభివృద్ధి కేంద్రంలో చేయవలసిన పూర్వ-విస్తరణ కృషిని గురించి వివరించారు. అభివృద్ధికేంద్రం ఉద్యోగులందరితో హృదయపూర్వకంగా సహకరించమని ప్రజలను కోరారు ఆయన. శాసనసభ్యుడు శ్రీ ఎస్. పి. చెంగలారాయ నాయుడు యీ కేంద్రాన్ని ప్రారంభిస్తూ, అది లభించిన గ్రామీణులను అభినందించారు. తమ ఆర్థిక పరిస్థితిని మెరుగు చేసుకొనుటకై గ్రామస్థులు యీ

అవకాశాన్ని వుపయోగించుకోవాలని విజ్ఞప్తి చేశారు ఆయన.

స్థానికబోర్డు వున్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ ఎ. కృష్ణమూర్తిరావు వందన సమర్పణ చేశారు.

ఈ వుత్సవం వినోద కార్యక్రమంతో ముగిసింది.

## ఎల్లయపాలెం హరిజన కాలనీ

ఎల్లయపాలెంలో ఎల్లయపాలెం హరిజన కాలనీకి 27-7-58 న నెల్లూరు జిల్లా కలక్టరు శంకుస్థాపన చేశారు.

ఎల్లయపాలెంలో స్థానిక హరిజనులకు ప్రభుత్వం, గ్రాంట్సుయిన్ యెయిడ్ పథకం క్రింద 34 యిళ్లను నిర్మిస్తున్నదని ఆ సందర్భంలో మాట్లాడుతూ కలక్టరుగారు చెప్పారు. ఈ కాలనీ నిమిత్తం రూ. 10,000 ఖర్చుపై అప్పుడే భూమి సంపాదించబడింది.

ఈ 34 కాక, ప్రభుత్వం 1957-58 లో నెల్లూరు తాలూకా కోడూరు యెంకన్న పాలెంలో 8, గూడూరు తాలూకా గొల్ల పాలెంలో 8 యిళ్ల నిర్మాణాన్ని చేపట్టింది. గడచిన సంవత్సరం గూడూరు తాలూకా వాకాడులో 28, ఆత్మకూరు తాలూకా రావులు కొల్లులో 20 యిళ్లు నిర్మించ బడ్డాయి. 1958-59 లో 80 యిళ్ల నిర్మాణానికి వసతి కల్పించ బడింది. ఈ కార్యక్రమమంతా ప్రభుత్వ గ్రాంటుయిన్ యెయిడ్ పథకం క్రింద చేపట్ట బడింది.

## శిక్షణా శిబిరాలు

ఎర్రగొండపాలెం అభివృద్ధి కేంద్రంలోని సనికవరంలో 5-8-58 న తహశీల్ దారు, మార్కాపురం, చే గ్రామ సహాయకుల శిక్షణా శిబిరం ప్రారంభింప బడింది. ఆ సందర్భంలో యేర్పాటు చేయబడిన గ్రామీణ ప్రదర్శనను శ్రీ బి. వి. రామయ్య ప్రారంభించారు.

శిక్షణా కాలంలో శిక్షితులు 8 వెంట యెరువు గుంటల త్రవ్వకం, సనికవరం చెరువు గర్భాన్ని పూడ్చడం పనులను చూచారు.

శిబిరం ఆఖరిరోజున ఆటలపోటీలు జరుప బడ్డాయి. వివిధ పోటీలలో గెలుపొందిన వారికి బహుమతులు పంచిపెట్ట బడినవి. శిక్షితులకు మెరిట్ సర్టిఫికెట్టులు యివ్వబడినవి.

## కొలిమిగుండ్ల గ్రామంలో

వ్యవసాయం, పశుపోషణ, చిన్నరకం నీటి పారుదల విషయాలలో గ్రామ సహాయకుల మూడవ శిక్షణా శిబిరం కొలిమిగుండ్ల గ్రామంలో 27-7-58 నుంచి 29-7-58 వరకూ జరిగింది. పూర్తిగా ప్రజల విరాళాలతో వరుసగా నడుపబడిన శిబిరాలలో యిది మూడవది.

ఈ శిబిరంలో శిక్షణపొందిన 53 మందిలోను 12 మంది పంచాయతీ సభ్యులు, 4 గురు ఉపాధ్యాయులు, ముగ్గురు గ్రామోద్యోగులు అయిదుగురు స్త్రీలు వున్నారు.

27-7-58 న సింగవరం పంచాయతీ అధ్యక్షుడు శ్రీ పి. మద్దులేటి రెడ్డి జాతీయపతాకను యెగురవేశారు. జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యుడు డా. బి. జె. నరసింహులు శిబిరాన్ని ప్రారంభించారు.

ప్రణాళికల పుద్యోగులు శిక్షితులకు శిబిరం, సమాజాభివృద్ధి, పంచవర్ష ప్రణాళికల ఆశయాలను, వుత్తమ వ్యవసాయ పద్ధతులు, పశుపోషణ, చిన్నరకం నీటి పారుదల విషయాలను వివరిస్తూ ప్రసంగించారు.

శ్రమదానోద్యమం జరుపబడింది. కొలిమిగుండ్ల గ్రామం రోడ్లు మరమ్మతు చేయబడినవి. శ్రమదానంలో శిక్షితులు, అభివృద్ధి కేంద్రం సిబ్బంది, గ్రామ పెద్దలు పాల్గొన్నారు.

శిక్షణా కాలంలో రాత్రులు చెంచునాటకం, జానపద నృత్యాలు యేర్పాటు చేయబడినవి. శిక్షితులలో చెడుగుడు, టగ్ ఆఫ్ వార్, సంగీతం,

బ్యాడ్మింటన్‌లలో పోటీలు జరుపబడినవి. పశుప్రద ర్శన, శిశు ప్రదర్శనకూడా యేర్పాటు చేయబడినవి. ఆటలపోటీలు చూచుటకై చుట్టుపట్ల గ్రామాలనుంచి వేలాది ప్రజలు వచ్చారు. పోటీలలోను, శ్రమదానం లోను వుత్సాహం చూపినవారికి బహుమతులు యివ్వబడినవి.

## కుదురుపాక గ్రామంలో

సుల్తానాబాదు అభివృద్ధి కేంద్రంలోని కుదురు పాక గ్రామంలో జూలై 29 నుంచి 31 వరకూ గ్రామ సహాయకుల శిక్షణాశిబిరం జరిగింది. ఈ సహా యకులలో 6 గురు పంచాయతీల సభ్యులు, 30 మంది రైతులు, 10 మంది సాంఘిక సేవకులు వున్నారు. వారు 5 గ్రామాలనుంచి వచ్చారు.

## చవటపల్లిలో

కంచికచెర్ల అభివృద్ధి కేంద్రంలోని చవటపల్లిలో పరుళ్లపాడు గ్రూపు సభ్యులు 50 మందికై 28-7-58 నుంచి 30-7-58 వరకూ శిక్షణాశిబిరం నడుపబడింది. అభివృద్ధి కేంద్రం ప్రాంతంలో చిన్న మొత్తాల పొదుపు వసూళ్లకై ప్రత్యేక వుద్యమం నడుపబడింది. చవటపల్లి, పరుళ్లపాడు, కీసర, కంచికచెర్ల గ్రామా లలో సమావేశాలు జరుపబడినవి.



# చిన్న మొత్తాల పొదుపు వుద్యమం

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలులో చిన్న మొత్తాల పొదుపు వుద్యమం విశిష్టమైన పాత్ర వహిస్తున్నది. చిన్న మొత్తాల పొదుపు వసూళ్లకు తొలి ప్రణాళిక కాలంలో రూ. 225 కోట్ల లక్ష్యం నిర్ణయించబడగా ద్వితీయ ప్రణాళికలో అది రూ. 500 కోట్లుగా నిర్ణయించబడింది. ఈ వుద్యమాన్ని అన్ని దిశలా తీవ్రించేస్తేనే యీ యెక్కువ లక్ష్యం సిద్ధిస్తుంది. ఇది ప్రతి కుటుంబానికి అంది, దానికి పొదుపు చేయడం నేర్పాలి. ద్వితీయ ప్రణాళిక ప్రధానంగా ప్రజాసహకారానికి ప్రాముఖ్యమిస్తున్నది. ఈవిధంగా, పొదుపు వుద్యమం విజయం యెక్కువగా అందరి సహకారంపై ఆధారపడి వుంటుంది.

ప్రజలు వెనుకవేసిన సొమ్మును చిన్న మొత్తాల పొదుపు సెక్యూరిటీలలో పెట్టుబడి పెట్టేలా చేయుటకై ఆంధ్రప్రదేశ్‌లో ఆర్థిక సంవత్సరం ఆరంభం నుంచి ఒక పద్ధతిలో అమలు జరిగే కార్యక్రమం ఆరంభించబడింది.

చిన్న మొత్తాల పొదుపు విషయంలో యేర్పడిన కేంద్ర సంస్థకు ఆంధ్రప్రదేశ్ ప్రాంతీయ నేషనల్ సేవింగ్సు ఆఫీసర్ ప్రాతినిధ్యం వహిస్తాడు. చిన్న మొత్తాల పొదుపు వసూళ్లను హెచ్చించుటకు కేంద్ర సంస్థతో సమశ్రుతిలో పని చేయుటకు రాష్ట్ర స్థాయిలో చిన్న మొత్తాల పొదుపు డైరెక్టరేటు యేర్పరచబడుటతో యీ వుద్యమవేగం హెచ్చింది. రెవిన్యూబోర్డు మొదటి సభ్యుడు ఎక్స్ అఫిషియో డైరెక్టరుగా యీ డైరెక్టరేటుకి అధ్వర్యం వహిస్తున్నారు. వివిధ శాఖలకు వసూళ్ల లక్ష్యాలు నిర్ణయించబడ్డాయి. క్రమాభివృద్ధిని సాధించుటకై జిల్లాలో జిల్లా కలక్టరు సమన్వయాధికారిగా నియమించబడ్డాడు. రాష్ట్ర సలహా సంఘం రాష్ట్ర ముఖ్యమంత్రి అధ్యక్షతన అమలుకై ప్రయోజనకరమైన సూచనలు చేసింది. రాష్ట్రానికి నిర్ణయించబడిన లక్ష్యాన్ని చేరుటకై రాజకీయ నాయకులందరి సహకారాన్ని పొందుటకై అఖిలపక్ష సమావేశం జరిపే విషయం ముఖ్యమంత్రి ఆలోచనలో వున్నది.

రాష్ట్ర రవాణాశాఖ, కొత్తగూడెం బొగ్గుగనులు, వజీర్ సుల్తాన్ పొగాకు ఫ్యాక్టరీ, రైల్వే వర్కుషాపులవంటి వివిధ పారిశ్రామిక సంస్థలలో అక్కడి వారు చిన్న మొత్తాల పొదుపులో పెట్టుబడి పెట్టేలా చేయుటకు తగిన ప్రచారం జరుపబడింది. కొత్తగూడెం బొగ్గుగనులలోను, బోధన్ పంచదార ఫ్యాక్టరీలోను పనిచేసే కార్మికుల బోనస్‌లో కొంత భాగం చిన్న మొత్తాల పొదుపు సెక్యూరిటీలకై సంపాదించబడింది.

కాలేజీలలోని ప్లానింగు ఫోరమ్‌లచే చురుగ్గా పని చేయించుటకు, వున్నత పాఠశాలల్లో సేవింగ్సు గ్రూపులను యేర్పరచుటకు కృషి చేయబడుతున్నది. 14-8-58 న హైద్రాబాదులోని బద్రుకా వాణిజ్య కళాశాల ప్లానింగ్ ఫోరం ప్రణాళికల మంత్రి శ్రీ వి. బి. రాజుచే ప్రారంభించబడింది. సంవత్సరానికి రూ. 25,000 లక్ష్యంగా నిర్ణయించినట్టు ఆ కళాశాల ప్రిన్సిపాలు ప్రకటించారు. వసూళ్ల కార్యక్రమం వేగాన్ని అన్నిదిశల హెచ్చించుటకై జిల్లా కలక్టర్లు ప్రతినెలా రెండురోజులు తీవ్ర వుద్యమాన్ని నడుపుతున్నారు.

పంచవర్ష ప్రణాళిక ప్రచారశాఖ, సమాచార పౌర సంబంధాలశాఖ డైరెక్టరు, నేషనల్ సేవింగ్సు శాఖలు చేసే ప్రచారాన్ని సమన్వయపరచుటకు చర్య గైకొనబడింది. నిర్ణయించబడిన లక్ష్యసాధనలో ముఖ్యపాత్ర వహించుటకై ఏజన్సీ సిస్టం బలపరుపబడుతున్నది. తపాల కార్యాలయాలలో జారీ, రొఖ్ఖంలోకి మార్పు విషయాలను చర్చించుటకై

తంతి, తపాలశాఖ డైరెక్టరు, చిన్న మొత్తాల పొదుపు డైరెక్టరు, ప్రాంతీయ నేషనల్ సేవింగ్సు ఆఫీసరు లతో సమన్వయ కమిటీ ఒకటి యేర్పాటు చేయ బడుతున్నది. నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్ల విక్రయానికి వీలుగా, సేవింగ్సు ఆఫీసర్ కార్యాలయంలోను, కొత్తగూడెం బొగ్గుగనులలోను, తగిన యితర ప్రదేశాలలోను సేవింగ్సు బ్యూరోల ప్రారంభానికై యేర్పాట్లు జరుగుతున్నాయి.

పరిశ్రమలలో కార్మికుల సేవింగ్సు యొక్క పేరోల్ మినహాయింపులకు అధికారం యిచ్చుటకై వేతనాల చెల్లింపు చట్టం సవరించబడింది.

అధికారం పొందిన యేజంట్లు యిప్పుడు, 1/2% కమిషన్‌పై 10 సంవత్సరాల ట్రెజరీ సేవింగ్సు సర్టిఫికెట్లకై ప్రచారం చేయవచ్చు. ఇందుకు పరిపూరక ఒప్పందాన్ని చేసుకుని సప్లిమెంటల్ సర్టిఫికెట్లను పొందాలి.

వ్యవహారంలో జరిగిన అపక్రమాలను సరిదిద్ది, పెట్టుబడిదారులకు అసౌకర్యం లేకుండా చూచుటకై సక్రమంగా యివ్వబడని నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లు, నేషనల్ ప్లాన్ సర్టిఫికెట్లు అన్నిటి విషయంలో మొత్తం మీద రాష్ట్రపతి ఆమోదం యివ్వబడింది.

## ఆంధ్రప్రదేశ్‌లో 1958 ఏప్రిల్ నుంచి జూన్ వరకూ వివిధ చిన్న మొత్తాల పొదుపు సెక్యూరిటీల క్రింద సాధించబడిన ఫలితాలు

| | | నేప్లా సేసట్లు | పోఆ సే బాడ్లు | ట్రెసే డిట్లు | అన్యూ యిటీలు |
|---|---|---|---|---|---|
| 1958 ఏప్రిల్ | | | | | |
| మొత్తం | ... | 26,59,000 | 73,02,000 | 11,29,000 | 1,32,000 |
| నికరం | ... | 20,03,000 | 11,62,000 | 11,24,000 | 1,30,000 |
| 1958 మే, | | | | | |
| మొత్తం | ... | 18,39,000 | 70,62,000 | 4,60,000 | 3,000 |
| నికరం | ... | 15,10,000 | 2,14,000 | 4,06,000 | —— |
| 1958 జూన్, | | | | | |
| మొత్తం | ... | 14,92,000 | 70,99,000 | —— | 7,000 |
| నికరం | ... | 11,61,000 | 9,27,000 | 20,000 | 4,000 |





సురక్షితంగా వున్న ఆనకట్ట భాగం

# కడం ఆనకట్టకు గండ్లు

(శ్రీ ఎస్. ఎన్. శాస్త్రి)

కుంభవృష్టి కురిసి నదులు పొంగి పొర్లుతున్నవన్న వార్తలవల్ల అసలే ఆందోళనగా వున్న సమయంలో కడం ఆనకట్టకు గండ్లు పడినవన్న వార్త పిడుగులా వచ్చింది. ఈ ఆనకట్ట పొడుగు 5,945 అడుగులు. ఇది ఆదిలాబాదు జిల్లాలో, హైదరాబాదుకు 162 మైళ్ల దూరంలో వుంది.

ఎంతో వుత్సాహంతో యేళ్లతరబడి కష్టపడి నిర్మించిన ఆనకట్ట వరుణదేవుని ఆగ్రహంతో క్షణాలలో చెడిపోయింది.

ఈ విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రజానీకం యెంత ఆందోళన పడుతున్నదో ప్రభుత్వమూ అంతే ఆందోళన పడుతున్నది.

ఈ ప్రాంతంలో ప్రభుత్వంచే మిక్కిలి చౌకగా నిర్మించబడిన వుపయోగ కరమైన ప్రాజెక్టులలో యిది ఒకటి. ఇది కొండలు చెట్టు చేమలతో చుట్టబడిన గిన్నెవంటి ప్రదేశంలో నిర్మించ బడింది. ఈ ప్రాజెక్టు వ్యయం ప్రాతిపదికపై యెకరానికి ఖర్చు రూ 500 మాత్రమే తేలివుండేది.

ఈ ప్రాజెక్టు ఆరంభ దశలలోనే 12,000 యెకరాల వరిపొలాలకు నీటి పారుదల లభింప చేసింది. దీనిపై యెన్నో ఆశలు పెట్టుకొని వుండడం జరిగింది. మధ్యలో యీ విధంగా హఠాత్తుగా ప్రమాదానికి గురికాక పోయినట్లయితే యిది ఒకటి రెండు ఋతువులలో అంచనా వేసిన మొత్తం ఆయకట్టు 65 వేల యెకరాలకు నీటి పారుదల లభింపచేసి వుండేది.



ఆనకట్టలో పెద్ద గండిపడిన భాగాలలో ఒక భాగం దృశ్యం

ప్రస్తుతపు ఆయకట్టు 12,000 యెకరాలకు రెండవ పంటకు యీ ప్రాజెక్టునుంచి నీటిని అందించాలని నిర్ణయించ బడింది కూడా. దుర్విధి అట్టి ఆశలను భగ్నం చేసివేసింది.

ఈ నష్టం యెంత తీవ్రమైనదో రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి వివరించారు. ఆయన దీనిని "జాతీయ దుర్ఘటన" గా అభివర్ణించారు. ఆయన విచారాన్ని ఒక్క ఆంధ్రులేకాక దేశంలోని యితర ప్రాంతాలవారు కూడా పంచుకున్నారు.

దారుణమైన యీ వార్త వినుటవల్ల యెంత బాధ కలిగినప్పటికీ లెక్కచేయక ముఖ్యమంత్రి, నీటి పారుదల శాఖామంత్రి శ్రీ జె. వి. నర్సింగరావు గారలు తతుణం అక్కడికి వురికి తతుణ మరమ్మతులకు వుత్తర్వు చేశారు.

నిరాశ్రయులైన వారికి, దిక్కుమాలిన వారికి పునరావాసం కల్పించుటలో రాష్ట్ర ప్రభుత్వ వివిధ శాఖలు తోడ్పడ్డాయి.

## నిష్ఫల పోరాటం

నిష్పతు పాతులైన పరిశీలకుల కథనం ప్రకారం, యీ విపత్తును తప్పించుటకు శక్యం గాకపోయింది. ఎందువల్ల నంటే, యీ సంవత్సరం వర్షాలు యిదివరకు యెన్నడూ కురవనంత యెక్కువగా కురిశాయి. ఒక సమయంలో 12 గంటలలో 12 అంగుళాలవర్షం కురిసింది. ఈ నష్టాన్ని తప్పించుటకు మానవ సాధ్యమైనదంతా చేయబడింది. ప్రధాన ఆనకట్ట 9 నిర్గమన ద్వారాలలోని షట్టర్లు అన్నీ పూర్తిగా పైకియెత్తివేయబడినవి. అప్పటికీ అవి 1.99 లతుల క్యూసెక్కుల్ని మాత్రమే అవతలకు పంపగలిగేయి. ధారాపాతంగా కురిసే వర్షమేమో 5 లతుల క్యూసెక్కులను నెట్టుతున్నది. ఇది జలాశయం నిలవశక్తి కంటె రెండు రెట్లు యెక్కువ. అంచేత, యీ ప్రకృతి విజృంభణలో, యేమి చేసినా నిష్ఫలమే అయింది. ఆఖరిప్రయత్నంగా, ఆనకట్టలో కొంతభాగాన్ని, కుడిగట్టుచివర బద్దలుకొట్టి తాసివున్న నీటిని అవతలికి పంపాలనికూడా ప్రయత్నించబడింది. కాని ప్రవాహ వేగం వుధృతంగా వున్నందున అది

సాధ్యపడలేదు. ఒకదశలో జలాశయము, ఆనకట్ట పూర్తిగా నీటిలో మునిగిపోయి అసలుపైకి యేమీ కనపడలేదు. పిట్ట గోడపై 1 1/2 అ. పైన నీరు ప్రవహిస్తున్నందున ఆనకట్టలో డీప్ సెక్షన్‌కి చేరడం అసాధ్యమయింది. ఆనకట్ట కొన్ని భాగాలు పగిలిపోవుటకు సూచనగా మొట్టమొదట పిస్తోలు పేలినట్టుగా చప్పుడుమాత్రం వినపడింది.

అదృష్టవశాత్తూ, ప్రధాన ఆనకట్ట 9 నిర్గమన ద్వారాలతో సహాసురక్షితంగావుంది. ప్రాణనష్టం కూడా యెక్కువలేదు. ఇద్దరు వృద్ధస్త్రీలు మాత్రం మరణించారు. నష్టంకూడా అనుకున్నంత యెక్కువ కాదు. కడం నది దేని వుపనదో ఆ గోదావరినది దానికి యించుమించు రెండుమైళ్లలోపు దూరంలోనే ప్రవహిస్తున్నందున వుధృతమైన యీ ప్రవాహం త్వరగా దానిలో కలిసిపోయింది. ఒక గట్టున నున్న గ్రామాలలో 7 మాత్రమే నష్టపోయాయి. 310 గుడిసెలు కొట్టుకుపోయాయి.

నష్టపోయిన గ్రామాలలోని ప్రజలందరికీ తగినంత ముందుగానే హెచ్చరిక చేయబడినందున, అధికారులు మెలకువతో వున్నారని, ఆనకట్టకు బాగా గండ్లు పడే ప్రమాదాన్ని ముందుగానే గ్రహించారని విశదమవుతుంది. తమతమ వస్తువులన్నిటిని తీసుకొనుటకై యెక్కువ సేపు అక్కడవున్న స్త్రీలు యిద్దరుమాత్రం మరణించారు. కాబట్టి స్థానిక వుద్యోగులు రాబోయే ప్రమాదాన్ని తెలుసుకోకుండా ప్రమత్తులై వున్నారనుటకు వీలులేదు. ఈ కారణంచేత, యీ విపత్తును తప్పించుటకై అధికార్లు తాము చేయగలిగినంతా చేసివుంటారని భావించడం సమంజసం. మహోద్ధృతమైన ప్రకృతి విజృంభణలో చిక్కుకొని, అంతకంటె యెక్కువ చేయలేకపోయారు వారు.

విపత్తు సంభవించినచోటుకి సాధ్యమైనంత శీఘ్రంగా వురుకుటలో పోలీసుదళాలు ప్రశంసనీయంగా పని చేశాయి. కొంతకాలం రాకపోకలు అన్నీ బంద్ అయినప్పుడు, పోలీసు వైర్‌లెస్ సహాయంతో పచ్చేపి రాష్ట్ర రాజధానికి నష్టం, యితర రక్షణచర్యలకు సంబంధించిన వార్తలు.



నష్టం వాటిల్లిన పిమ్మట ఆనకట్టస్థలం వద్ద విధి నిర్వహణలో నున్న పోలీసు అధికారులు



శాసన సభ్యురాలు శ్రీమతి లక్ష్మీకాంతమ్మ, ఈమె ప్రమాదం జరిగిన స్థలాన్ని సందర్శించిన మొట్ట మొదటి శాసన సభ్యురాలు, నష్టపోయిన గ్రామాలను చూచి నిరాశ్రయులయిన ప్రజలను కలుసుకుని, స్త్రీలతో మాట్లాడి, రక్షణ చర్యలను గమనించారు.

ఈ గండ్ల సంగతి వినగానే, విజయవాడలో రాష్ట్ర వరద నివారణ బోర్డు సమావేశానికి హాజరైన రాష్ట్ర రెవిన్యూబోర్డు సభ్యుడు శ్రీ ఎమ్. టి. రాజు, చీఫ్ ఇంజనీర్లు శ్రీయుతులు ఎల్. వెంకట కృష్ణయ్యరు, ఎ. ఆర్. వెంకటరామన్‌లు హుటాహుటిగా అక్కడికి వెళ్లారు.

వెంటనే చీఫ్ ఇంజనీరు లిద్దరూ 12,000 యెకరాలలోని పైర్లను రక్షించే విషయమై ఆలోచించారు. గండ్లగుండా నీరు మహావేగంతో ప్రవహించి పోయినందున జలాశయం దాదాపు ఖాళీ అయిపోయింది. పెద్దపెద్ద గోడముక్కలు ఆనకట్టనుంచి యించుమించు రెండు ఫర్లాంగుల దూరానికి విసరికొట్టబడ్డాయంటే, అదియెంత యేలావుందో సులభంగా వూహించుకోవచ్చు. రాతి-మట్టి ఆనకట్టలో కొన్ని భాగాలు ఛిన్నాభిన్నమైపోయి కడం నది అంతటా జల్లబడ్డాయి. కడం నదిలో ప్రవాహాన్ని మామూలు ప్రమాణంలో వుంచి, దాని నీటిని దానికి పై మట్టంలోగల ప్రధాన కాలువలోనికి తోడి, పైరుచేలకు సరిపడ నీరు లభింపచేసే విషయంలో యిప్పుడు కృషి చేయబడుతున్నది.

ఈ ఆనకట్ట స్థలాన్ని యెవరుచూసినా, విశృంఖలమైన ప్రకృతిమాత్రమే కలిగించగల వూహాతీతమైన యిట్టి నష్టాన్ని చూస్తే గుండె పగిలిపోతుంది. కాంపోజిట్ ఆనకట్ట అవశేషాలను చూస్తే నేలపాలైన గొప్ప ప్రాజెక్టు దృశ్యం కళ్లకికట్టి విచారం కలుగుతుంది.

## నిరాశ్రయులకు సహాయం

నిరాశ్రియులకు పునరావాసం కల్పించుటకై రెవిన్యూ అధికారులు యెంతో కృషిచేశారు. నిరాశ్రయుల్ని యెత్తుగల మెట్టుక ప్రదేశంలో స్థిరపరచుటకు ప్రత్యేకం ఒక తహశీల్‌దారు కేటాయించబడ్డాడు. అతనికి సహాయం చేయుటకు నాయబ్‌—తహశీల్‌దారు యివ్వబడ్డాడు. నిరాశ్రియులు తమ

తమ యిళ్లను తిరిగి కట్టుకొనుటకై కలప మున్నగు వాటి సేకరణలో అటవీశాఖ ఉద్యోగులు కూడా యెంతో కృషిచేశారు. ఇది యిలావుంచి, బాధితుల రక్షణకై అక్కడికక్కడ రూ. 80 ఎక్స్‌గ్రేషియా గ్రాంటు యివ్వాలని ఉత్తరువు చేయబడింది.

వరదలతో అంటువ్యాధుల సమస్య రేకెత్తుతుంది. ఈ సమస్యను ప్రజారోగ్య అధికారులు శీఘ్రంగా, సమర్థంగా పరిష్కరించారు. ప్రజలందరికీ టీకాలు వేసి, దిక్కులేనివారికి పాలపొడి, బట్టలు పంచిపెట్టి వారు యెంతో సేవచేశారు.

కనీ వినీ యెరుగని వర్షాలవల్లా, తత్ఫలితంగా వచ్చిన వరదలవల్లా దురదృష్టవశాత్తూ కలిగిన యిట్టి నష్టాలవంటివి తిరిగి రాకుండా తగిన జాగ్రత్త తీసుకుని ఆనకట్టను సాధ్యమైనంత త్వరలో పునర్నిర్మించవలసిన అవసరం కలదని ప్రభుత్వానికి పూర్తిగా తెలుసు.

ఆహారోత్పత్తికి సంబంధించినంతవరకూ, ఆంధ్ర ప్రదేశ్ భారతదేశానికి ధాన్యాగారం కావడాన, యీ గండ్ల మరమ్మతు, అవసరమైతే కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సహాయంతో, తక్షణం చేపట్టబడగలదని హృదయపూర్వకంగా ఆశించబడుతున్నది.





కాలనీని ప్రారంభించుటకు వచ్చిన ప్రాంతీకల మంత్రికి స్వాగతం యివ్వబడుతున్నది.

# లక్ష్మీనగరం కాలనీ

సికిందరాబాదుకి సమీపంలోగల లక్ష్మీనగరం గ్రామంలో మురికి పేటలలో నివసిస్తున్నవారు చక్కగా నిర్మించబడిన కాలనీలో నివసించుటకు వీలు కలిగించుటకై ఆ గ్రామస్థుడు, శాసన సభ్యుడు అయిన శ్రీ వి. రామారావు గృహనిర్మాణ సహకార సంఘాన్నొక దానిని యేర్పాటు చేశారు. శ్రీ సయ్యద్ షా అబ్దుల్ కాదర్ కి లక్ష్మీనగరం పక్కన కొంత భూమివుంది. దానిలో ఒక భాగాన్ని నామమాత్రంగా రూ. 1,000 విక్రయించుటకు ఆయనను శ్రీ రామారావు ఒప్పించారు. సాంఘిక సేవాశాఖ శరవేగంతో దానిని సంపాదించి ప్రారంభ ఖర్చుకై రూ 3,000 మంజూరు చేసింది. సహకార సంఘం రిజిస్టరు అయింది. సహకార శాఖ రూ 9,000 మంజూరు చేసింది. సభ్యులు తాము యిచ్చేది కూడా కలిపి యింతవరకూ 4 గృహాలను నిర్మించారు. మరి 21 గృహాలకు పునాది వేశారు. పూర్తిఅయిన పిమ్మట కాలనీలో 63 గృహాలు వుంటాయి. అధునిక పద్ధతులలో నిర్మించబడిన వీటిలో ఒక్కొక్కగృహం అంచనా ఖర్చు రూ. 3,000. హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో ఆరోగ్యం, విద్య, పిల్లల ఆటస్థలం మున్నగు సౌకర్యాల పట్ల ప్రత్యేక శ్రద్ధతో నిర్మితమయే హరిజన కాలనీ యిదొక్కటే.

హోంశాఖామంత్రి శ్రీ కె. వి. రంగారెడ్డి 1957 లో యీ కాలనీకి శంకుస్థాపన చేశారు. సహకార శాఖామంత్రి స్వర్గీయ చీఫ్ ఇంజనీరు, టౌన్ ప్లానింగు,సహాయంతో కాలనీ లేయవుట్ప్లాన్ వుచితంగా లభించే యేర్పాటు చేశారు. శ్రీ

యుతులు కె. వి. నర్సింగరావు, డి. సంజీవయ్య, బ్రిగేడియరు మున్నగు ప్రముఖులు యీ కాలనీ
వి. బి. రాజు, మెహిదీనవాజ్ జంగ్, కంటోన్మెంటు నివర్శించారు.



కాలనీ దృశ్యం



# కార్మికుల విరాళం

ద్వితీయ పంచవర్ష ప్రణాళికకు తమవిరాళం సూచనగా రూ. 1,116 చెక్కును పంపించారు ప్రభుత్వానికి సికిందరాబాదులోని ప్రగాటూల్సు కార్పొరేషన్ కార్మికుల యూనియన్ వారు.

ఈ విరాళానికై వారికి కృతజ్ఞత తెలుపుతూ, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద కార్మికుల శ్రేయస్సుకై యీ సొమ్ము వినియోగింపబడాలని ఆదేశించారు రాష్ట్ర ముఖ్యమంత్రి.



# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్ల ప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరు పేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శాతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: 10¾ × 8¼" డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 3వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేయబడని డిమాండు డ్రాఫ్ట్ ద్వారాగాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైద్రాబాదు—దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసింది, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,
సమాచార, పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైద్రాబాదు దక్కన్ — 1.